## గంటల పంచాంగం

నందన సంవత్సర భాద్రపద బ॥ ద్వాదశి 1952 సం॥ సెప్టెంబరు 16 మంగళవారం సం॥ ద్వాదశి ఉ 5-57 ఆశ్లేష సా 6-28 వర్జ్యం ఉ 7-31 కు.

బ॥ త్రయోదశి సెప్టెంబరు 17 బుధవారం బు॥ త్రయోదశి ప 8-31 మఘ రా 9-22 వర్జ్యం ఉ 7-52 ల.


# ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర అప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్ - (మహాభారతము)

నందన సం॥ భాద్రపద బ॥ ద్వాదశి

మంగళవారం


## ఇందూరు సభ

అఖిలభారత కాంగ్రెసు సంఘం ఇందూరు సమావేశం జయప్రదంగా సమాప్తమైంది. సభికులు ప్రభుత్వవిధానాలను ఏకగ్రీవంగా ఆమోదించి నెహ్రూనాయకత్వంలో తమ అఖండమైన విశ్వాసాన్ని మరొకసారి ప్రకటించారు. ఏతీర్మానం మీదా దీర్ఘచర్చ జరగలేదు. కొందరు తీర్మానాలకు సవరణలను ప్రతిపాదించారు. ఈ సవరణల ప్రతిపాదన, ఉపసంహరణ, నిరాకరణ అన్నీ లాంఛనప్రాయంగానే జరిగాయి.

కాంగ్రెసు నిబంధనావళి సవరణపైనే కొంతగొడవజరుగుతుందని, ఈ విషయంపై దాదాపు రెండుమాసాలుగా దేశంలో రేగుతూవచ్చిన గాలిదుమారంబట్టి చాలా మంది కాంగ్రెస్‌వాదులు భయపడ్డారు. పరిస్థితులు విషమించకుండా చేయాలనే భావంతో ప్రతి ఒక్కరూ నిబంధనావళి సవరణకు కొన్ని ప్రతిపాదనలుచేస్తూ వచ్చారు. ఏమైతేనేం ఇంతగాలి దుమారం నాయకుల ఇష్టాగోష్ఠి సంప్రతింపుల ఫలితంగా ఇట్టే సద్దుమణిగింది.

కాంగ్రెసు నిబంధనావళి సవరణల విషయంలో రెండు శాఖలకు కుదిరిన రాజీకూడా పండిట్ నెహ్రూ విజయాన్నే చాటుతున్నది. కాంగ్రెసు పార్లమెంటరీశాఖపై అధికారం కావాలని కాంగ్రెసు సంఘాలవారు పట్టుబడుతూ వచ్చారు. దాదాపు రెండుసంవత్సరాల క్రితం 'నెహ్రూ — టాండన్ వివాద'మేర్పడినప్పుడు ఏశాఖపై ఏశాఖకు అధికారం వుండాలనే సమస్య ఢిల్లీ కాంగ్రెసు మహాసభ తీర్మానం ద్వారా పరిష్కారమైంది. అప్పట్లో ఆ వివాదం కాంగ్రెసులోని రెండు శాఖలకుగాక, ఇద్దరు వ్యక్తులమధ్య ఏర్పడిందని కాంగ్రెసువాదులు అధికసంఖ్యాకులు అభిప్రాయపడ్డం వల్లనే కాంగ్రెసుకార్యవర్గం ప్రతిపాదించిన సవరణలపై ఇప్పుడింత గాలిదుమారం రేగింది.

యు. పి. ప్రాంతానికి ఈ వ్యవహారం అంతా ఇదివరకే పరిష్కారమైంది. ఆ పరిష్కారాన్ని అనుసరించి కాంగ్రెసు నిబంధనావళిని సవరించడానికే ఉన్నతవర్గం ప్రయత్నించింది. ఈ ప్రయత్నాన్ని ప్రతిఘటించినవారు ఇందూరుసభ ఆమోదించిన సవరణల ద్వారా సాధించింది ఏమీ లేదు. శాసనసభల కాంగ్రెసుపార్టీ సభ్యులకు కాంగ్రెసు సంఘాలలో వోటులేని సభ్యత్వం ఇవ్వబడినందువల్ల కాంగ్రెసులోని రెండుశాఖలకూ పూర్వం కంటె ఎక్కువ సన్నిహిత సంబంధం ఏర్పడవచ్చు. కాని ఈ రెండు శాఖలు ఒకే సంఘంగా వ్యవహరించడం మాత్రం జరక్కపోవచ్చును. కాంగ్రెసు సంఘాల్లో శాసనసభల కాంగ్రెసు సభ్యులకు అసోసియేట్ సభ్యత్వం కల్పించినట్లే శాసనసభల కాంగ్రెసు పార్టీల్లోనూ కాంగ్రెసు సంఘాల కార్యవర్గ సభ్యులకు అసోసియేట్ సభ్యత్వం ఏర్పరుస్తూ కాంగ్రెసు పార్టీల నిబంధనావళిని సవరిస్తే పరిస్థితి ఇప్పటికంటె కొంత అభివృద్ధి చెందవచ్చును

ఇప్పటికే నిబంధనావళి సవరణ సమస్య అందరికి సమ్మతంగా పరిష్కారమైనందుకు దేశం యావత్తు సంతోషించగలదు.

ఇందూరు మహాసభ చేసిన ఇతర తీర్మానాలు కేవలం పూర్వ నిర్ణయాల పునరుద్ఘాటనే. దక్షిణ ఆఫ్రికాలో శ్వేతేతరజాతులు సాగిస్తున్న 'సాత్విక నిరోధాన్ని' ఏ. ఐ. సి. సి. హర్షించింది. పోరాటాన్ని సాగిస్తున్న ఆఫ్రికను, భారతీయుల అభినందించింది. మలాన్ ప్రభుత్వ జాతివివక్షణ శాసనాలను ప్రతిఘటిస్తున్న దక్షిణాఫ్రికా భారతీయ కాంగ్రెసు, ఆఫ్రికా జాతీయ కాంగ్రెసులకు ఆర్థికసహాయం చేయాలని విజ్ఞప్తిచేసింది.

స్వాతంత్ర్యంకోరకు పోరాటం సాగిస్తున్న ట్యునీసియా ప్రజల పట్ల సానుభూతి తెలుపుతూ అఖిలభారత కాంగ్రెసు సంఘం మరొక తీర్మానం చేసింది.

ఈ తీర్మానాలకు అఖిల భారత కాంగ్రెసు సంఘ సభ్యులూ, కాంగ్రెసువాదులే గాక, భారతీయులు అందరూ ఆమోదించి అమలుజరుపవలసినట్టివే.

ఇవిగాక ఇందూరు సమావేశం చేసిన మరి రెండుముఖ్య తీర్మానాలు ప్రభుత్వ విదేశాంగ విధానానికీ, దేశ ఆర్థిక విధానానికి సంబంధించినవి. కాంగ్రెసుసభలో ఇదివరకు చేస్తూవచ్చిన విదేశాంగవిధాన తీర్మానానికి ఇందూరు సభ ఆమోదించిన తీర్మానానికీ కొంత తేడా వుంది. ఇంతవరకూ కాంగ్రెసు మహాసభ 'శాంతిభిక్ష పెట్టవలసిందని ఒకర్ని కోరలేదు. శాంతి సందేశాన్ని' సంక్షుభిత ప్రపంచానికి అందచేస్తూ వచ్చింది. ఇప్పుడు కాంగ్రెసు సంఘం ప్రపంచ అగ్రనాయకులందరూ సమావేశమై తమ మధ్య ఏర్పడిన విభేదాలను పరిష్కరించుకొని ప్రపంచానికి శాంతిభిక్ష పెట్టాలని విజ్ఞప్తి చేస్తున్నది. ఈ తీర్మానం, ఇటీవల ప్రపంచం అంతటా జరుగుతున్న శాంతిసభల తీర్మానంలాగా వున్నది గాని ఒక దేశపరిపాలనాబాధ్యతను వహించిన జాతీయపక్షం చేయవలసిన తీర్మానంగా లేదు. ఈ తీర్మానాన్ని కాంగ్రెసు అధ్యక్షుని హోదాలోనే అయినా, ప్రధాన మంత్రి పండిట్ నెహ్రూ తయారుచేయడంకొంత ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నది.

ప్రధానమంత్రిగా పండిట్ నెహ్రూ శాంతిసాధనకు ఏ ప్రయత్నం చేశారు. శాంతి సాధనకు ఎన్ని ప్రయత్నాలైనా చేయవలసిందే. ఆ ప్రయత్నాలు తీర్మానరూపంలో ఉంచడంకంటే కార్యరూపం దాల్చితే మంచిది.

## 'కార్పొరేషన్ ఎన్నికల్లో కాంగ్రెస్‌నే గెల్పించండి'

### రాజాజీ విజ్ఞప్తి

మదరాసు, సెప్టెంబరు 15: మదరాసు కార్పొరేషను ఎన్నికలలో ప్రజలు కాంగ్రెసు అభ్యర్థులను బలపరచాలని మదరాసు ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలాచారిగారు నిన్న సాయంత్రం లింగిచెట్టి స్ట్రీటులో జరిగిన బహిరంగసభయందు విజ్ఞాపనచేశారు. మదరాసు జిల్లాకాంగ్రెసు కమిటీ యాజమాన్యాన యీసభ శ్రీ యం. పి. శివజ్ఞానగ్రామణిగారి అధ్యక్షతను జరిగింది.

శ్రీ శివజ్ఞానగ్రామణిగారు శ్రీ రాజాజీ రాష్ట్రప్రజల శ్రేయానికై చేస్తున్న పలుసహాయ్యకార్యాలను వివరిస్తూ వారిప్రభుత్వము ప్రజాస్వామ్య పద్ధతులమీద జరుగుచున్నందున ప్రజలు బలపరుచవలసినదని కోరారు.

శ్రీ రాజగోపాలాచారిగారు మాట్లాడుతూ మదరాసునగరం చాలా విస్తారమైనదని యీమహానగరం పౌరసంబంధమైన వ్యవహారాలను కార్పొరేషను కొనసాగిస్తున్నదని అన్నారు. కార్పొరేషను పరిపాలనాబాధ్యత మహత్తరమైనది. ఈకార్పొరేషను కౌన్సిలు ఎన్నికలకు యిపుడు పలువురు పోటీమీద నిలిచియున్నారు. విశేష బరువు వేసిన చేతిబండిని లాగడం ఎంతకష్టమో కార్పొరేషను పరిపాలనా బాధ్యతనిర్వహించడం కూడా అంతకష్టమే. ఈ విషయం గమనించి అందుకు తగిన వారే ఎన్నికలలో అభ్యర్థులుగా నిలవడం మంచిది. ఆశక్తిలేనివారు పోటీ నుండి విరమించాలని నా కోరిక.

కాంగ్రెసు సంస్థ చాలా కాలనుండి ఉండే సంస్థ ఆది మంచి ముసలి ఆవులాగా యింకా మంచి పాలను యిస్తూ ఉంది. ఆ పాలలో నీళ్లు కలసినంతవరకు అది బాగా ఉంటుంది. అందుచేత ఆ మంచి పాతఆవును మాత్రం త్రోసివేయరాదు. కార్పొరేషనులో కాంగ్రెసు అభ్యర్థులను పరిశీలించి మంచివారిని అభ్యర్థులుగా నిలపటానికి ప్రయత్నించి అందు కేర్పడిన కమిటీ వారు మంచివారిని ఎంచియున్నారు. ప్రజలు వారిని ఎన్నికలలో బలపరచి విజయం చేకూర్చాలి. నగర పరిపాలన వ్యవహారములు నగరం పెరిగియున్నకొద్దీ ఎక్కువైపోయియున్నది. డివిజన్ల సంఖ్యకూడా పెరిగినది. నగర పరిపాలనా వ్యవహారాలు ఆదర్శంగా జరగాలంటే నీతిపరులైనవారితో మంచికౌన్సిలు ఏర్పడాలి. కౌన్సిలర్ల మధ్యకూడా ఐక్యత యుండాలి. ఈ విషయాలన్నీ గమనంలో ఉంచుకొని ఎవరికి మీరు ఓటుచెయ్యాలో బాగా ఆలోచించుకొని ఓటుచేయాలి.

కాంగ్రెస్ అభ్యర్థులు జాతీయ సంస్థ వల్ల నిలబెట్టబడియున్నందువల్ల వారికి మీ రందరూ ఓటుచేసి కాంగ్రెస్‌కు విజయం చేకూర్చాలి. కాంగ్రెస్‌కు యీ డివిజనులలో విజయం చేకూరితే అది నా విజయంగా భావించగలను. అయితే కాంగ్రెస్‌కు పరాజయం కలిగితే యిదివరకు కలిగిన ఫలితమే కలిగినదని నేను అనుకొనెదను. ఈమారు కాంగ్రెస్ తప్పక గెలవాలి. ప్రజలు అన్ని డివిజనులలో సహకరించి కాంగ్రెస్‌కు విజయం సాధించి తోడ్పడాలని విన్నవిస్తున్నాను. అని శ్రీ రాజాజీగారు చెప్పారు.

## ఆంధ్రరాష్ట్రం కొరకు అబ్దుల్ లతీఫ్‌గారి ప్రాయోపవేశం

మద్రాసు, సెప్టెంబరు 15: స్వామి సీతారాం అనుమతిలో మద్రాసువచ్చి ఏడురోజుల ఉపవాసం ప్రారంభించిన లతీఫ్‌గారు ఇవాళ రెండోరోజు ఉపవాసం చేస్తున్నారు. లతీఫ్‌గారి వయస్సు 28. కీ.శే. హైదరాబాదు ప్రజా కాంగ్రెసు కార్యాలయంలో సేవాదళ శిక్షకులుగా ఉంటున్నాననీ, ఇంతకుముందు గాంధీజీ మహాత్ముని తరం వారి ఆత్మశాంతికై 14 రోజులు భువనగిరిలో ఉపవాసం చేశాననీ, ఐ. ఎన్. ఎ.లో ఉంటిమనీ, స్వామి సీతారాం హైదరాబాదు వచ్చినప్పుడు వారి రాష్ట్రనిర్మాణ సంకల్పం ఎడ తనకు అనురక్తి కలిగినదనీ చెప్పారు. లతీఫ్ గారు మద్రాసు వచ్చేముందు భీమవరం స్టేషనులో రైల్వేఉద్యోగి అత్యాచారానికి గురి అయినామనీ, రిజర్వు పోలీసులు నినాదాలుచేస్తూండిన సత్యాగ్రహులను కాళ్ళుగొండూ పట్టుకు ఈడ్చి అమానుషంగావ్యవహరించారనీ, మర్నాడు ఏమి ఉత్తర్వులు వచ్చినవో సత్యాగ్రహులపై చెయ్యి వెయ్యలేదనీ అన్నారు.

ఇంకో సత్యాగ్రహి పొన్నూరి ఆది నారాయణగారు వీరి వయస్సు 25 ఏండ్లు. గోవిందప్పనాయకవీధిలో బట్టలవ్యాపారం చేస్తున్నారు. రాష్ట్ర నిర్మాణంలో మద్రాసుకుంగల సానుభూతి వెల్లడించడానికి తాము మూడు రోజులు ఉపవాసం ప్రారంభించామనీ, రేపు సాయంత్రంతో తమవ్రతం ముగించగలదనీ చెప్పారు. వీరు భగవద్గీతా పఠనంతో తమకాలాన్ని గడుపుతున్నారు.

## కూము నదిలో శవం

మదరాసు, సెప్టెంబరు 15: కృష్ణస్వామి అనే 50 యేండ్ల వాని శవం నిన్న చింతాద్రిపేట వద్ద కూము నదిలో తేలుచుండగా పోలీసులు దానిని శవపరీక్షా స్థలానికి పంపారు.

## ఐచ్ఛిక భటుల, ప్రేక్షకుల క్రమశిక్షణారాహిత్యం

### నెహ్రూ మందలింపు

ఇందూర్, సెప్టెంబరు 14: ఏ. ఐ. సి. సి. పందిరిలో కాంగ్రెస్ ఐచ్ఛిక భటులూ కొంతమంది ప్రేక్షకులు ప్రదర్శించిన క్రమశిక్షణారాహిత్యం పండిట్ నెహ్రూకు ఆగ్రహకారణమైంది. పండిట్ నెహ్రూగారు లేచి పందిరిలో వెంటనే శాంతి నెలకొల్పని యెడల బయటికి పంపించి వేస్తానని వాలంటీరు నాయకునితో చెప్పారు. వాలంటీర్లు, ప్రేక్షకులు మాటిమాటికి లోపలికి రావడము, బయటికి వెళ్ళడము మొదలు పెట్టారు. నెహ్రూగారు కోపం వచ్చి 'ఇది ఏ. ఐ. సి. సి. సమావేశం కాదు, ఇందూరు మార్కెటని మీరు తలుస్తున్నట్లు వున్నది' అని మృదువుగా అన్నారు. సభలో అల్లరి తగ్గక పోవడంవల్ల ఆయనకు మరింత కోపం వచ్చింది. నుంచున్న వారిని, అటూ ఇటూ తిరుగుతున్న వారిని ఉద్దేశించి 'కూర్చోండి! లేవకున్నంత వరకు జేవ వద్దు. ఇక మీకు యిక్కడ లేక పోతే బయటికి వెళ్లి పొండి' అని కేక వేశారు. పందిరి ప్రశాంతమైంది. ప్రజలు యెక్కడి వారక్కడె కూర్చున్నారు. సభా కార్యక్రమము మరల ప్రారంభమైంది.

## పాకిస్తాన్ సరిహద్దున కాల్పులు ప్రారంభం

కలకత్తా, సెప్టెంబరు 15: సరిహద్దులో కాపలాకు పెట్టియున్న పాకిస్తాన్ సేనలు రంగపూరుజిల్లాలో (తూ. బెంగాలు) ఒకచోట అక్రమరవాణా కొస్తున్న ఒక జట్టుపై తుపాకులు కాల్చడంలో ముగ్గురు ముస్లిములు మరణించినట్లు ఒక పత్రికలో పడిన ఒకానొక వార్త తెలుపుతున్నది.

అక్రమ రవాణా నిరోధ ఆర్డినెన్సు క్రింద మొట్టమొదటి దఫాగా సాయుధ పోలీసులు రంగాపూరు జిల్లాలో జనము అక్రమంగా రవాణా చేస్తున్న ఒక మూకపై తుపాకులు కాల్చినట్లూ అందులో ఒకడు చనిపోయినట్లూ డక్కా పత్రిక తెలుపుతున్నది.

ఫుల్బారీ (రంగాపూరు)లో యూనియన్ బోర్డు అధ్యక్షునితో సమేతంగా చాలామంది ముస్లిములను కస్టడీలోకి తీసుకొన్నారు.

## రాజకీయ ఖైదీల సత్వర విచారణకు ప్రత్యేక 'ట్రిబ్యునల్సు'

### ఈజిప్టు ప్రభుత్వ నిర్ణయం

కైరో, సెప్టెంబరు 14 నాలుగు రోజులక్రిందట అరెస్టు చేయబడిన రాజకీయ నాయకుల విచారణను త్వరత్వరగా పూర్తిచేసేందుకు ఈజిప్టు ప్రభుత్వం కొన్ని ప్రత్యేకమైన ట్రిబ్యునల్సును నియమించడానికి నిశ్చయించింది.

ఈ విచారణలు పూర్తి అయిన తరువాత దేశంలో రాజకీయ వాతావరణం స్వచ్ఛపడిన తరువాతనే ఎన్నికలకు సన్నాహాలు ప్రారంభించాలని కూడా ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది. నజీబ్ మంత్రివర్గం ఈ రాజకీయ ఖైదీల విచారణకు సంబంధించి ఒక శిక్షాస్మృతిని తయారుచేసింది; ఆ శాసనం మంగళవారంనాడు అమలులోకి వస్తుంది. ముద్దాయిలలో ఎవరైనా నిజంగా రాజకీయ నేరాలు చేసినట్లు బుజువు అయినట్లయితే, అట్టివారికి 3 ఏళ్లు 7 ఏళ్ళలోపు కారాగార శిక్షలు, ఓటుహక్కు, ఎన్నికలకు నిలబడే హక్కు రద్దు చేయటం, ప్రభుత్వ ద్రవ్యం అపహరించి వున్నట్లయితే, అంతకంతే జరిమానా విధించటం మున్నగు శిక్షలు విధించడానికి ఆ శిక్షాస్మృతిలో అవకాశం కల్పించబడింది.

నజీబ్ అరెస్టు చేయించిన రాజకీయ నాయకుల సంఖ్య మొత్తం 60; ఇందులో ఇద్దరు మాజీ ప్రధానులు, ముగ్గురు రాజకుటుంబీకులు, అరడజనుమంది మాజీ మంత్రులు యింకా అనేకమంది రాజసభ్యులు వున్నారు. పోలీసులు వీరి ఇళ్ళమీదను అఫీసులమీదను దాడ్లు చేసి చాలా ముఖ్యమైన దాఖలాలు పట్టుకుపోయినట్లు తెలుస్తున్నది.

జనరల్ నజీబ్ అలెగ్జాండ్రియాలో యీ వేళ ఒక మిలిటరీ పాఠశాలలో ప్రసంగిస్తూ, రకరకాల కొత్త ఆయుధ సామగ్రి ఈజిప్టుకు త్వరలో దిగుమతి కానున్నదనీ, అఫీసర్లు సైనికులు శిక్షణ విషయంలో శ్రద్ధవహించాలనీ హెచ్చరిక చేశారు.

భూమిసంస్కరణలకు అడ్డువచ్చేవారిని ఎవరినైనా సరే ప్రభుత్వం కఠినంగా శిక్షించగలదని ఆయన హెచ్చరించారు.

గడచిన వారంలో నజీబ్ ప్రభుత్వం భూమిసంస్కరణలనే కాక అనేక యితర సంస్కరణలను కూడా అమలు జరిపింది. అవి యేమనగా, మంత్రులయొక్క రాజకుటుంబీకులయొక్క ప్రత్యేకహక్కులను తొలగించటం; అద్దెలు తగ్గించటం; ప్రభుత్వోద్యోగులకు ప్రావిడెంటుఫండు ఇన్‌స్యూరెన్సు స్కీము ఒకటి యేర్పాటు చేయటం; సైనికుల జీతాలు పెంచటం; వ్యవసాయకూలీల వేతనాలను నిర్ణయించటం; వగైరా.

"ఈజిప్టును ఒక్కరోజులో ఐశ్వర్య సౌభాగ్యాలతో తులతూగేట్టు చెయ్యాలంటే సాధ్యంకాదు. ఇది కాలక్రమాన కష్టపడి సాధించవలసిన పని." అని ఈజిప్ట్ ప్రభుత్వ ప్రతినిధి స్టేట్ మంత్రి అయిన ఫతీ రద్వాన్ ఈ వేళ ప్రకటించాడు.

అరబ్ లీగు కౌన్సిలు సమావేశానికి హాజరవుతున్న అరబ్ రాజకీయ నేతలు మధ్యప్రాచ్య రక్షణ ఒడంబడిక విషయం చర్చించారు.

ఈజిప్ట్ కొత్త రాయబారి డా॥ మహమ్మద్ ఫౌజీ వచ్చేవారం లండను చేరుకుంటారు. ఆ వెంటనే ఈజిప్టు బ్రిటనుల మధ్య రాయబారాలు పునః ప్రారంభం కాగలవని తెలుస్తున్నది.

అరబ్ లీగు కార్యదర్శి పదవికి అబ్దుల్ రహమాన్ అజ్జాంపాషా స్థానే అరబ్ లీగు కౌన్సిలు ఈ వేళ ఈజిప్ట్ మాజీ విదేశాంగమంత్రి అబ్దుల్ ఖలేక్ హస్సూనాను ఎన్నుకొన్నది. అజ్జాం పాషా ఈ పదవికి సెప్టెంబరు 9వ తేదీన రాజీనామా ఇచ్చాడు; ఆ రాజీనామాను కౌన్సిలు ఆమోదించి, అరబ్ లీగుకు ఆయన చేసిన సేవను ప్రశంసిస్తూ తీర్మానం చేసింది.

## హిమాలయ శిఖరాల అంతు తేల్చడానికి మరో ప్రయత్నం

ఖాట్మండు, సెప్టెంబరు 14: హిమాలయ పర్వతాలలో నిమన్యాలూ (266576) అన్నపూర్ణ (246886) హిమాల్ చులీ అనే 3 శిఖరాల అంతు చూడడానికై వచ్చిన 5గురు జపానీయుల జట్టు యీనాటి ఉదయం యిక్కడికి వాయవ్యంగా 10 మైళ్ళ దూరాన వున్న కొక్కని బయలుదేరి వెళ్ళారు. ఇక్కడికి వాయవ్యంగా 160 మైళ్ళ దూరంలో వున్న పొకారా [illegible] వద్ద ఒక విడిది ఏర్పాటు చేసుకుంటారు. కూడా ఆ జట్టున వారి ప్రతినిధి ఒకరు ఈ సంగతి చెప్పారు.

అక్కడ కావలసిన పరికరాలు భోజన పదార్థాలూ అన్నీ, వెంట తీసుకువెళ్ళారు. ఇప్పటి [illegible] [illegible] అసలు పర్వతారోహణకు ప్రయత్నం [illegible] సంగతి [illegible] [illegible] [illegible] [illegible] [illegible] చూసు కున్న [illegible] 25 [illegible] [illegible] [illegible] బయలుదేరి వెళ్ళాలని నిశ్చయించుకొన్నారు.

## జపాన్-భారతదేశాల ఒడంబడిక

### టోకియో రాయబారి ప్రశంస

కలకత్తా, సెప్టెంబరు 14: ఇండియా జపానులు చేసుకొన్న శాంతి ఒడంబడిక యుద్ధానంతరం అంతర్జాతీయ సామరస్యానికి ఒక కొత్త తరహా నమూనా కల్పించిందని ఇండియాకు జపాను రాయబారిగా నియమింపబడిన సాంకోమూనిషియామా ఇవాళ ఇక్కడ చెప్పారు.

టోకియోనుంచి ఢిల్లీకి వెళ్తు ఆయన నేటి మధ్యాహ్నం ఇక్కడ దిగారు. ఈ ఒడంబడిక విషయంలో ఇండియా ప్రదర్శించిన సాటిలేని, నిష్కల్మష ఔదార్యాన్ని జపానువారు ఎంతో ఘనంగా చెప్పుకొంటున్నారని కూడ ఆయన అన్నాడు.

ఈ ఉభయ దేశాల మధ్యగల సాంస్కృతిక, ఆర్థిక సంబంధాలను ఇతోధికంగా పెంపొందించుటకు ఇండియాకు మొట్టమొదటి జపాను రాయబారిగా వచ్చిన తాను శాయశక్తులా కృషి చేస్తానని ఆయన హామీ యిచ్చారు.

తన దేశంలో కమ్యూనిస్టుపార్టీ చర్యలను గురించి ముచ్చటిస్తూ ఆయన ఇట్లన్నాడు: "అక్కడ కమ్యూనిస్టులలో చాలా మంది ప్రచ్ఛన్నంగా ఆందోళన చేసే బాపతే. యువకులనూ, విద్యార్థులనూ, మంచిమాటలు చెప్పి, తమ లోకి కొత్తగా లాగుకొంటూ వుండడానికి పనిగా పెట్టుకున్నారు. తరచు హింసా దౌర్జన్యాలకు దిగుతూ వుంటారు. ఇటీవల వారు ప్రజాభిమానం బాగా కోలుపోతూ వున్నారు. అక్టోబరు 1వ తేదీనాడు ప్రతినిధి సభకు జరగనున్న ఎన్నికలలో వారి అసలు బలం పరిష్కారంగా తేలిపోతుంది. సభ మొత్తంమీద ఇప్పుడున్న కమ్యూనిస్టు సభ్యులు పదే పదిమంది. వచ్చేసారికి అంతకూడా ఉండదని నా నమ్మకం."

నిషియామా రేపు ఉదయం ఢిల్లీకి పయనమవుతారు. ఈ వారాంతం లోపల అధ్యక్షుడు రాజేంద్రప్రసాదు దర్శనం చేసుకొని సన్నదుల సమర్పించుకొంటారు.

## నెహ్రూ విజ్ఞప్తి

(1—వ పేజీ తరువాయి)

అనే బాగుపడుతుంది.

కేంద్ర ప్లానింగుమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందాగూడా ఈ సభలో మాట్లాడారు. ప్రజలను నవభారత దేశ నిర్మాణంలో భాగస్వాములను చేయాలన్న ఉద్దేశంతోనే, ప్లానింగ కమిషన్ ఈ సమాజాన్ని సృష్టించడానికి పూనుకున్నదని ఆయన చెప్పారు. కొత్త కొత్త ప్రాజెక్టులను, కొత్త కొత్త నిర్మాణ పథకాలను అమలు జరపడంలో ప్రజల మద్దతు వుంటేనే గాని లాభంలేదు. అందుకొరకే ఈ సేవక సమాజం ఏర్పడింది అని అన్నారు.

మధ్యభారత్ శాసనసభ స్పీకరు శ్రీ ఏ. ఎస్. పట్వర్ధన్ మాట్లాడుతూ, మధ్యభారత ప్రజలు ఉత్సాహంతో ఈ సమాజంలో చేరి, నవభారత నిర్మాణానికి తాము అవిరళ కృషి చేయగలరని హామీ ఇచ్చారు.

## ఆంధ్ర శాఖ సభ్యుల నియామకం

### నరసింహదేవర సత్యనారాయణగారి ప్రకటన

కాకినాడ, సెప్టెంబరు 14: భారత సేవక్ సమాజం ఆంధ్రశాఖ సమావేశకర్తగా అధ్యక్షులైన పండిత జవహర్‌లాలు నెహ్రూగారిచే నియమితులైన శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు అధ్యక్షుల ఆమోదంతో ఈ క్రింది వారిని భారత సేవక్ సమాజం ఆంధ్ర శాఖ రాష్ట్రీయ సలహాసంఘ సభ్యులుగా ఎంచియున్నట్లు తెలుపుతున్నారు.

సలహాసంఘ సభ్యుల పేర్లు:-(1) శ్రీ మూరిశెట్టి వెంకటస్వామినాయుడు తూర్పుగోదావరి, (2) శ్రీ కె. టి. గోపాలరావు (రాజమండ్రి) (3) శ్రీ దేశరాజు మోహనరావు (రాజమండ్రి) (4) శ్రీ డి. యస్. రామమూర్తి (కృష్ణ) (5) శ్రీమతి సై. దమయంతి (తిరుపూరు) (6) శ్రీ జి. ప్రసన్నయ్యశాస్త్రి (7) డా॥ సి. వీరయ్యచౌదరి (గుంటూరు) (8) శ్రీ సి. రమణారెడ్డి (నెల్లూరు) (9) శ్రీ పోచ్. తిమ్మారెడ్డి (కడప) (10) శ్రీ సి. రామశాస్త్రి (అనంతపురం) (11) శ్రీ బి. పి. శేషారెడ్డి (కర్నూలు) (12) శ్రీ నానా సుబ్బరావు, (13) శ్రీమతి సి. అనసూయాబాయి (14) శ్రీ డి. వెంకట సుబ్బరావు (15) శ్రీ చాముకారి (16) శ్రీ టి. ఎస్. రెడ్డి (17) శ్రీ సి. ప్రకాశరావు (18) శ్రీమతి డి. కామేశ్వరమ్మ (19) శ్రీమతి డి. లక్ష్మీబాయమ్మ (మదరాసు).

ఇంకా యిద్దరి పేర్లు త్వరలో ప్రకటింపబడుతుంది.

ఆంధ్రశాఖ భారతసేవక సమాజం యొక్క జిల్లా కమిటీల స్థాపనకు సమావేశకర్తలుగా యీ క్రిందివారు నియమింపబడియున్నారు.

(1) శ్రీ యం. జగన్నాథరావు (విశాఖపట్నం) (2) స్వామి నిత్యబోధానంద (రాజమండ్రి) (3) శ్రీ టి. కుటుంబశాస్త్రి (పశ్చిమ గోదావరి) (4) డా॥ సి. వీరయ్యచౌదరి (గుంటూరు) (5) శ్రీ యం. ఆర్. అప్పారావు (కృష్ణాజిల్లా) (6) శ్రీ పెన్నలకంటి రాఘవయ్య (నెల్లూరు) (7) శ్రీ కల్లూరి సుబ్బరావు (అనంతపూరు) (8) శ్రీ టి. పుల్లారెడ్డి (కడప) (9) శ్రీ నిశక్తి వెంకటసుబ్బయ్య (కర్నూలు).

ఆంధ్రప్రదేశ్‌లో మిగతా జిల్లాలకు సమావేశకర్తల పేర్లు తరువాత ప్రకటింపబడగలవు.

### మదరాసులో కార్యాలయం

భారత సేవక్ సమాజం కార్యాలయం మైలాపూరు లజ్ చర్చి రోడ్డు యందలి ఆంధ్రమహిళా సభ [illegible] వనంలో తాత్కాలికంగా శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారిచే తెరవబడియున్నది.

## అయిదేళ్ల బాలుని అగచాట్లు

కలకత్తా, సెప్టెంబరు 15: గోచిపాతకూడ లేకుండా, ఖాళీ ఇంత గోతంసంచి మోసుకొని, కుమిలికుమిలి యేడుస్తూ, ఒక అయిదేండ్ల హిందూ పిల్లవాడు అల్లంత దూరాన ఉన్న ఖులానానుంచి ఒక్కడే ఒక్కడు రైలులోపడి నిన్న ఇక్కడికివచ్చాడు. ఆ అబ్బాయి ఈ ఊరికి సరికొత్త. టిక్కెట్టులేదు. గుండె గలవాడు గానే ఖుల్నా-బారిసాల్ ఎక్స్‌ప్రెస్సులో సీల్దాలో దిగినవాడు దిగి నట్టు సరాసరి పోలీసుస్టేషనుకు వెళ్ళి, అక్కడివారికి తన గాథ అంతా ధైర్యంగా చెప్పుకొన్నాడు.

బందిపోటు దొంగలకు భయపడి అతడు తల్లిదండ్రులతోనూ, సోదరునితోనూ ఖులానా జిల్లాలో (పాకిస్తాన్) ఒక గ్రామంనుంచి ఎలాగో బైటపడి పారిపోయి వచ్చాడట. పాకిస్తాన్ నుంచి ఇండియాకు వచ్చేదారిలో తల్లిదండ్రులను ఎక్కడో, ఎలా పోగొట్టుకొన్నాడో మాత్రం చెప్పలేకపోయాడు.

ఆ అబ్బాయి ఇప్పుడు పోలీసు కస్టడీలో ఉన్నాడు. అతనిని ఏదైనా ఒక అనాథశరణాలయానికి చేరుస్తారు.

## అనధికార తీర్మానాల త్రోసివేత

(1—వ పేజీ తరువాయి)

కాని అది పరస్పర సంప్రదింపుల ద్వారా ఉభయపక్షాల అంగీకారంమీద జరగాలి. తీర్మానాలు తీసుకురావటం, ఉద్యమాలు లేవదీయటం ఈ సమస్యా పరిష్కారానికి మార్గం కానే కాదు. అసలు రాజప్రముఖులకు యీ హామీలను ప్రభుత్వం ఏ సందర్భంలో యిచ్చిందో; అప్పుడా హామీలను ఇచ్చి వుండకపోతే, ఏమయ్యేది అనే విషయాలను కొంత మనసుపెట్టి ఆలోచించవలసిందిగా సభ్యులకు విజ్ఞప్తి చేస్తున్నాను. ఆనాటి ప్రచారానికిపూర్వం 1947 జులై ఆగస్టునాటి పరిస్థితులను ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకోండి. ఆ పరిస్థితులలో ఈ మాజీ సంస్థానాధిపతులను కూడగట్టుకొని రావటానికి సామోపాయాన్ని ప్రయోగించి వుండవలసిందా లేక దండోపాయాన్నా అనేదికూడా ఆలోచించండి. సర్దార్ పటేలు చేసిన ధీరోచిత ప్రయత్నం ఫలితంగా యీ సంస్థానాధిపతులు రక్తపాతం లేకుండా భారత ప్రభుత్వంతో రాజీకివచ్చారు; ఆయన ఆ కృషి ఫలించి వుండకపోయినట్లయితే, పరిస్థితులు అప్పుడు ఎలా పరిణమించి వుండేవో ఆ భగవంతుడికే ఎరుక. సంస్థానాధిపతులకు మనం అప్పుడు ఇచ్చిన హామీలు ఇప్పుడు ఇస్తున్న భరణాలు ఇవి అన్నీ కూడా మనం వారికి చెల్లిస్తున్న పరిహారం అన్నమాట.

ఈ పరిహారం ఎక్కువా తక్కువా అనేది వేరే విషయం. ఆ పరిస్థితిలో మనం కొంత పరిహారం చెల్లించటం అవసరం అయింది; చెల్లిస్తామని హామీ ఇచ్చాం. ఇప్పుడా ఒప్పందానికి తిరిగిపోవటం మనకు గౌరవప్రదమైన విషయం కాదు. పోనీ రాజప్రముఖులు దేశంలో చాలా మంది వున్నారా అంటే, ఏడెనిమిది మందికంటే లేరు. వారిమీదకు మనమంతా కలిసి దండెత్తటం ధర్మయుద్ధం అనిపించుకో [illegible].

ఈ వ్యవహారాన్ని సంప్రతింపుల ద్వారా సామరస్యంగా పరిష్కరించుకోవాలి." అని చెప్పి ఈ తీర్మానాలను ప్రతిఘటించవలసిందిగా పండిట్ నెహ్రూ సభ్యులకు విజ్ఞప్తి చేశారు. అంతట రాజప్రముఖులను గూర్చిన తీర్మానం ఉపసంహృతమైంది. ప్రభుత్వోద్యోగులను గూర్చిన తీర్మానం అత్యధిక సంఖ్యాబలంతో నిరాకరించబడింది.

చర్చకురాని తక్కిన అనధికార తీర్మానాలను కార్యవర్గం పరిశీలించగలదని నెహ్రూ తెలియజేశారు.

సమావేశానికి చక్కని ఏర్పాట్లు చేసినందుకు మధ్యభారత్ కాంగ్రెసు కమిటీని ఆయన అభినందించారు. అంతటితో ఏ. ఐ. సి. సి. సమావేశం ముగింపుకు వచ్చింది.

## పరామర్శ

### — యుగంధర్

వేదికలపై ఉపన్యాసాలు మన దారిద్ర్యాన్ని నిర్మూలించవు.

నివేదికలపై తీర్మానాలు మన సమస్యలను పరిష్కరించవు.

పావురాలను ఎగురవేస్తే, శాంతి లభించదు.

ప్రాయోపవేశాలు చేస్తే రాష్ట్రం రాదు.

ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ హితోపదేశం ఇది.

సత్యాగ్రహంచేస్తే చెన్నపట్నం రాదు.

ఇది మద్రాసు ఆర్థిక మంత్రి మంత్రోపదేశం,

అప్పుడప్పుడు......

ప్రాయోపవేశం చేస్తూ, సత్యాగ్రహంచేస్తే చెన్నపట్నంతో ఆంధ్రరాష్ట్రం వస్తుందని 'ఆత్మస్వరూప' అభిప్రాయం.

పదిమంది పదిరాళ్లు విసిరితే ఆంధ్రరాష్ట్రం రాలకపోతుందా అని ఆంధ్రకేసరి ఆశ.

ప్రకాశంగార్ని నమ్ముకుంటే రాష్ట్రం రాకెక్కడికిపోతుందని విశ్వనాథంగారి నమ్మకం, విశ్వాసం.

రాష్ట్రంకోసరం ప్రజలు నాయకులను నమ్ముకుంటే కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదినట్లే అని పంతులుగారి హెచ్చరిక.

నాయకులందరూ సిద్ధిపొందితే గాని ఆంధ్రుల ఆదికాలపువాంఛ సిద్ధించదని ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు గుంటూరులో గంటకొట్టారు.

ఆంధ్రనాయకులు ఎవరికొంతువారు గాక, ఒకరి గొంతు మరొకరు పిసుక్కుంటూ వున్నంతకాలంవారు సిద్ధిపొందుతారన్న సందేహం సామాన్యులకు కలగడం సహజం.

ఎన్నికలైన తరువాత వచ్చేటంతగా పీకపిసికే బలం మననాయకులకు వున్నట్లు కన్పించదు.

అంతటి శక్తివుండివుంటే వీరంతా ఏకకాలంలో దేహం చాలించి ప్రజల సంకటాలను తీర్చివుండేవారు.

నాయకులు అవతారం చాలించడం గాని అవతారం మారిస్తే రాష్ట్రావతరణ అవకాశం వుండేమో అనికూడా అంటారు.

అది అక్కడా వున్నట్లు కన్పించదు.

నాయకులు అవతారాలను మారిస్తే గాక చాలిస్తే రాష్ట్రం వస్తుందని పంతులుగారు ఎంతగా చెప్పినా రాష్ట్రావతరణకు తమ అవతారాలను చాలించే నాయకుడొక్కడూ కన్పించడు.

నూకలు చెడితే నూకలు కొనుక్కుంటారు అందరూ. చెడ్డ ప్రతీదక్తే దను చుకోనివారెవరు?

అలాగే రాష్ట్రంవస్తే అంతావస్తే వాళ్లే. రాష్ట్రానికి 'చచ్చే' వాళ్లెవరుకి ఎవరన్నా వుంటే పంతులుగారు సెలవియ్యవచ్చు.

నాయకులు పోతేగాని రాష్ట్రం రాదన్న నాయకుడు, ఏదో ఒకరాయి తగిలి రాష్ట్రం రాలకపోతుందా అని ఆశించడం, ఆ రాష్ట్రం రాలు కోలాన్ని నిరీక్షిస్తూ వుండటం అసంబద్ధంగా కన్పిస్తుంది!

నిజానికిది అసందర్భంగా లేదు. నాయకులంతా పోయినతరవాత రాష్ట్రం ఎవరికి? రాష్ట్రంవస్తే నాయకులందరికీ కావాలి రాకపోతే ఎవ్వరికీ అక్కర్లేదు! కాని మనంపోతే రాష్ట్రం వచ్చిపోతుందేమో అన్న బెంగ నాయకులందరికీ వుంది.

అందుకే అందరూ "రాష్ట్రం వస్తుందేమో చూచిపోదాం" అని కూర్చున్నారు. 'మనం కూర్చున్నంతసేపూ రాష్ట్రం రాదు.' అని పంతులుగారు నెత్తిన నోరు పెట్టుకొని ఘోషిస్తున్నారు. అయినా కూర్చున్న చోట్నుంచి ఎవ్వరూ లేచేటట్లు లేదు. 'చాతుర్మాస్యం' అని ఆత్మస్వరూపుడు భీమవరం నుంచి కదలడం లేదు.

"నేను కూర్చుంటేగదా లేచిపోవడానికి" అంటారు ఆచార్య రంగాగారు అట్నానాపోతూ కోపనుంచి.

"మేం లేచిపోతేనుంటే కూర్చొ చెసుతూ లేచిపోలేదని మమ్మల్ని నిందిస్తే ఏంలాభం" అంటారు సంజీవరెడ్డి, వెంకట్రావు, గోపాలరెడ్డి ప్రభృతులు.

కోటలోపల పాగావేస్తే అని హింసఅని స్వామి సీతారాం శిష్యులు కోటముందు పాకవేసుకు కూర్చుంటే సత్యం వస్తుందా అని అదికొస్తా టీకేశారు.

* * *

ఇప్పుడు ప్రపంచానికి శాంతి, ఆంధ్రులకు రాష్ట్రంకావాలి. ఈ రెండూ ఎప్పుడు ఎలావస్తాయో తెలియకుండా వుంది.

అగ్రనాయకులంతా సమావేశమై తమ విభేదాలను తొలగించుకుంటే శాంతి లభిస్తుందని ఏ. ఐ. సి. సి. తీర్మానించింది.

ఆ సమావేశం జరిగే అవకాశంలేకు కొంచెమైనా ఇంకా విశ్వాసులు "శాంతి తెచ్చుకోవడానికి పావురాన్ని ఎగరవేయమ"న్నారు పండిట్ నెహ్రూగారు.

పావురాళ్లను ఎగరవేస్తే శాంతిరాదని తెలిసికూడా నెహ్రూగారు ఒకరాయి విసిరి నష్టం నిమించిన ఒక పావురాన్ని ఎగరవేశారు.

పావురాళ్ళుమనకు శాంతి చిహ్నాలు కావుగనుక నెహ్రూ విసిరిన పావురాయిలో రాష్ట్రం రాల్తుందేమో అని పంతులుగారు చూస్తూ వుండకపోలేదు.

మనకు పావురాళ్ళు శాంతిచిహ్నాలు గాక "చిత్రాంగి- సారంగధర" విషాదాంత ప్రేమగాథకు స్మారక చిహ్నాలు!

ఢిల్లీ-[illegible]లమధ్య కల్లోలం తెచ్చిన పావురాళ్లివి.

ఈ రాళ్ళను ఎగరవేస్తే శాంతిరాదు విసిరితే రాష్ట్రంరాదు.

ఈ రాష్ట్రోద్యమం ప్రజలపాలిటి గుదిబండయింది. అయితే రాష్ట్రం వస్తుంది. నాయకులచేతుల్లోపడి కొట్టురాయి కాకుండాపోతే రాష్ట్రం వస్తుంది.

స్వామీ సీతారాం భీమవరం నుంచి కదలక, రంగాగారు దేశం రాక, సంజీవరెడ్డిగారు కుర్చీక, ప్రకాశంగారు కూర్చోక, విశ్వనాథం గారు ఎటూ చేరలేక వుంటే మరి రాష్ట్రం ఎలావస్తుంది?

ప్రకాశంగారి ప్రయత్నాల ఫలితంగా ఇప్పటికి రాష్ట్రం మూడుసార్లు వచ్చిపోయింది. అందుకే ఆయన విసిరెత్తి మేసుందరం చస్తేగాని రాష్ట్రం రాదన్నారు.

పాపం శమించుగాక!

వచ్చినరాష్ట్రం ఎక్కడికి పోయింది? ఎట్లా పోయింది? ఎవరెత్తుకు పోయినారు? ఇటీవల మన్యం [illegible] ఆ మన్య సోషలిస్టులు వచ్చేపోయే ప్రతిగ్రైలును ఆపి వెతుకుతూ వచ్చారు. రాష్ట్రం వున్న ట్రంకుపెట్టె ఒక్కటీ కన్పించలేదు.

రాష్ట్రం వేటాడానికి పంతులుగారు బయల్దేరి వస్తే [illegible] అయినా కన్పించినట్టులేదు.

అయినా ప్రకాశంగారు చెన్నపట్నంలో వుంటే విజయవాడ స్టేషన్లో ఏం కన్పిస్తుంది?

అయితే మరి రాష్ట్రం రానట్టే?

ఎంత మాట! విశ్వనాథంగారు చెప్పినట్లు అంటేకూడా పంతులుగార్ని నమ్ముకొంటే. వారు చెప్పినట్లు చేయండి.

నాకం [illegible] జ్ఞాపకం చేసుకోండి.

నాయకులు రాష్ట్రం తెచ్చే వరకు కోవాలి. ప్రజలు నాయకులకు వరకు కోవాలి. కావా మరి! నిరక్షరకుక్షులకే ఫలిస్తుంది.

[illegible] రాకపోవడం. [illegible] [illegible] [illegible] చూసి చెప్పాలి!

# "శ్రీకాకుళం జిల్లాను క్షామప్రాంతంగా ప్రకటించాలి"

## రాష్ట్ర రివెన్యూమంత్రికి నాయకుల విజ్ఞాపన

మదరాసు, సెప్టెంబరు 13: శ్రీకాకుళం జిల్లాను క్షామ ప్రాంతముగా ప్రకటించాలని కోరుతూ జిల్లా కాంగ్రెసు తిరపున అధ్యక్షుడు శ్రీ కోటగిరి సీతారామస్వామి, శ్రీ లుకలాపు లక్ష్మణదాస్ శ్రీ హనుమంతు సత్యనారాయణగార్లు మదరాసు ప్రభుత్వ రివెన్యూ మంత్రికి ఒక విజ్ఞప్తిని సమర్పించారు.

శ్రీకాకుళం జిల్లా పరిస్థితులను వివరిస్తూ వారు విజ్ఞప్తిలో ఇంకా ఇల్లా తెలియజేశారు.

శ్రీకాకుళం జిల్లా కొత్తగ ఏర్పాటు చేయబడినప్పుడే మంచి ప్రభుత్వ లెక్కల ఆధారం చూపినదని పాను విషయంలో స్వయం సమృద్ధమైన జిల్లాగా ప్రకటించారు. పెరుగు పుష్కలంగా పండి కంట్రోల్లు తీసి వేయు సమయానికి ధరల మామూలు ప్రమాణమునకు వచ్చాయి.

ఈ సంవత్సరం దురదృష్టవశాత్ ఇంతవరకు వానలు లేనందున ఇరిగేషన్ సౌకర్యాలు వున్న రెండుమూడు తాలూకాలు మినహాయిస్తే జిల్లా అంతటా ఊడ్పులే జరుగలేదు. వరసగ రెండు మూడు నెలలుగ వర్షములు లేనందున నారుమళ్లు నాశన మయ్యాయి.

మామూలు రోజుల్లోనే ఈ ప్రాంతమంతా అర్ధాశనంగా క్షామప్రాంతంగా వుండేది. రోజు రోజుకు ధాన్యం ధరలు పెరిగిపోతున్న ఈ సమయంలో అక్కడి వారి స్థితి మరీదుర్భరంగ వుంది. దీనికి తోడుగ వర్తకులు పిల్లల అపరిమితంగా తూర్పు గోదావరి ప్రతి రోజూ లారీల మీదధాన్యం, బియ్యమును ఎగుమతి చేస్తున్నారు. ఇది ఒక సమస్య అయింది. నిరుటివలె పంట బాగా వుంటే మా జిల్లా స్వయం సమృద్ధమైనదేగాని మిగులు జిల్లా కాదు. క్షామ పరిస్థితుల దృష్ట్యా జిల్లాల నుండి ఎగుమతి నిలిపి వేయుట అవసరమని కలెక్టరు ప్రభుత్వానికి రిపోర్టు చేసినట్లు రూఢిగా తెలుస్తున్నది. వారి సూచన ప్రకారం వెంటనే చర్యతీసుకోని ఎడల ధరలు విపరీతముగా పెరిగిపోగలవు. ఇక ముందు వానలు వచ్చినా నారుమళ్లు చచ్చిపోయి తిరుగం మించి పోయినందున ఊడ్పులకు సావకాశం లేదు. కనుక ఈ జిల్లాను క్షామ ప్రాంతంగా వెంటనే ప్రకటించాలని కోరుతున్నాము.

వెంటనే మైనరు ఇరిగేషను పనులను ప్రారంభించి, చౌకధర డిపోలను ఏర్పాటుచేసి, రోడ్ల నిర్మాణము మొదలయిన సహాయ కార్యక్రమమును ప్రారంభించి కొంతవరకైనా క్షామబాధను తగ్గించాలని విన్నవించుకుంటున్నాం."

## ప॥ గో॥ జిల్లా మెట్ట ప్రాంతాల దుస్థితి

### మాగంటి సీతారామదాసుగారి ప్రకటన

ఏలూరు, సెప్టెం 12: ఈ ఏడాది ఇంతవరకూ వర్షాలు పడనందున పశ్చిమ గోదావరిజిల్లా మెట్టప్రాంతాలైన చింతలపూడి, పోలవరం, కొవ్వూరు తాలూకాలలో పరిస్థితులు విషమరూపం దాల్చినవని జిల్లా బోర్డు అధ్యక్షుడు మాగంటి సీతారామదాసుగారు ప్రకటిస్తున్నారు. ఏసస్యము వేసెందుకూ అదును దొరకలేదు. రైతులు కూలీలు కూలిచేసి బ్రతుకుదామన్నా పనిపాటు లు లేక, పందాడి ప్రజవచ్చి బ్రతుకు తెరువు చూపించ కోరుతున్నారు. ఈ ప్రాంతాలలో పరిస్థితులు స్వయం గా చూసి చాలా విచారం కలిగింది. ఈ దుస్థితి తొలగించేందుకు కరువుపనులు ప్రారంభించాలనే వుద్దేశంతో జిల్లా కలెక్టరు, ఇంజనీరు గార్లతో కలిసి ఒక ప్రణాళిక తయారు చేశాము. దానిని ప్రభుత్వామోదానికి పంపాము. పరిస్థితుల తీవ్రతను గ్రహించి ప్రభుత్వం ఈ ప్రణాళికను త్వరలో ఆమోదిస్తుందని ఆశిస్తున్నాము. అని సీతారామదాసుగారు ప్రకటించారు. (స్వ. వి.)

## చిత్తూరు సమీప గ్రామంలో సారాబట్టీ

### పోలీసుదాడిలో 356 డాముల సారా పట్టుబడుట

చిత్తూరు, సెప్టెంబరు 11: ఇక్కడికి 8 మైళ్లలో వలమ పెరిగొడ్డుపైగల గొల్లపల్లిలో మధ్య నిషేధోద్యోగులు నిన్న, 356 డ్రాముల సారా, బట్టీకి సిద్ధంగా వున్న 767 గాలన్ల ద్రవముకు పట్టుకొని 25 మందిని అరెస్టు చేశారు. అరెస్టయినవారిలో ముగ్గురు స్త్రీలు వారందర్నీ నిన్ననే స్థానిక సబ్ మేజస్ట్రేటు కోర్టులో హాజరు పెట్టారు.

ఈ దాడి ఈ జిల్లా డిప్యూటీ సూపరింటెండెంటు, ఏ. కృష్ణస్వామి అయ్యరు నాయకత్వాన జరిగింది. అసిస్టెంటు సూపరింటెండెంటు సి. బి. పాటిల్, సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఎన్. వెంకటరత్నం, తాలూకా సబ్ ఇన్‌స్పెక్టరు ఎం. ఎల్. రామస్వామయ్య పాల్గొన్నారు. తాలూకా పోలీసు సేషనులో మద్యనిషేధచట్టం క్రింద 25 కేసులు రిజిస్టరై వున్నాయి.

## చిత్తూరుజిల్లాకాంగ్రెసుసభ్యత్వం

ఈ జిల్లాలో ఈ ఏడాది కాంగ్రెసు సభ్యులుగా 12,500 మంది చేరారు. ఇందులో 700 మంది రూ. 1-4-0 కట్టిన కార్యకర్తలు మిగతా వారు 0-4-0 కట్టిన ప్రాథమిక సభ్యులు. (స్వ. వి.)

## మార్కాపురం తాలూకా ప్రజల ఆకలి యాత్ర

యర్రగొండపాలెం, సెప్టెంబరు10: కర్నూలుజిల్లా కలెక్టరు యీ 6 వ తేదీన యర్రగొండపాలెంలో మకాం చేసిఉన్న సందర్భంలో, మార్కాపురం తాలూకా ప్రజలు, యన్. వెంకటయ్య, ఎం. ఎల్. ఏ. యం. వెంకటయ్య (జిల్లా కృషికార్పార్టీ కార్యదర్శి) గారల నాయకత్వాన ఆకలి యాత్రగా కలెక్టరు వద్దకు వచ్చారు. ప్రతి గ్రామంలోను గంజ కేంద్రాలు పెట్టించవలెనని, యీ కేంద్రాలను కృషికార్ పార్టీ నాయకత్వం వహించి నిర్వహిస్తుందని చెప్పగా యే గ్రామాలలో గంజి కేంద్రాలు కావలెను, జాబితా యివ్వవలెనని కలెక్టరుగారు అడిగారు. జాబితా అందజేయబడింది. బీద ప్రజలకు యిద్దరు జమీన్‌దార్ల భూమిపై ధాన్యం మాపేరా అప్పులిచ్చుటకు అంగీకరించారు.

ఈ ఆకలి యాత్రలో మమూరు పయ్యమంది ఆంబోడీలుగూడ పాల్గొన్నారు. వారు ఆహారంగా తింటున్న ఆకులలములు తెచ్చి కలెక్టరు గారికి చూపెట్టారు."

కలెక్టరుగారు తమ కోర్కెలను అంగీకరించినందుకు, యన్. వెంకటయ్య ఎం. ఎల్. ఏ. గారు ధన్యవాదము లర్పిస్తున్నారు.

## మినన్ దంపతుల విహారణ

మదరాసు, సెప్టెంబరు 14: నగర నగ్రసమైన ఆర్కాడు అద్దిరియైన కేసు సందర్భంలో సంబైనుండి పోలీసు కాపలాలో మదరాసుకు తేబడిన శ్రీ ఏ. కే. మినన్‌ను యీ దినం రాయపురంలో నూతనస్థాపనలకు అవలకల సముద్ర ప్రాంతానికి పోలీసులు తీసుకొనిపోయి కొన్ని వివరాలను ప్రశ్నించారు. ఈ ప్రదేశంలో రక్తంతో మరకబడిన ఒకవస్త్రం పోలీసులకు దొరికినట్లు తెలుస్తున్నది.

మినన్ భార్యఅయిన మిసెస్ శనకి యీ దినం కిరిగాంపులో నుంచబడింది. ఆ తరువాత మెడికల్ పరీక్షార్థం ఆమెను ఎగ్మూరు ప్రసూతి వైద్యశాలలో చేర్చారు.

## నగరట్రాన్స్‌పోర్టుసలహాసంఘం

మదరాసు, సెప్టెంబరు 14: నగర ట్రాన్స్‌పోర్టు సలహా సంఘం 12 తేదీన సమావేశమైంది. హోంశాఖ కార్యదర్శి అధ్యక్షత వహించారు.

సలహా సంఘంవారు శిఫార్సులలో కొన్ని ఇల్లా వున్నాయి. ప్రయాణీకుల సమ్మర్దం వున్నచోట "క్యూ" పద్ధతిని కట్టుదిట్టంగ అమలు జరపాలి. బస్సులలో దీపాల ఏర్పాటును చక్కబరచాలనీ, కండక్టరు "వేగ్ బిల్" వ్యాసేద్వారం బద్ద మంచి వెల్తురువచ్చే దీపం ఏర్పాటు చేయాలనీ, ప్రయాణీకుల సమర్థము, అవసరమును బట్టిబస్సు ప్రయాణమార్గమును మార్చుటకు లైసెన్స్ పర్లకు అధికారం ఇవ్వవచ్చని సిఫార్సుచేశారు. కంప్లయింటు పుస్తకములను కండక్టరువద్ద వుంచకుండా బస్సులోనే ఒక బహిరంగ స్థలములో వుంచాలనీ ఈ విధానమును మరికొన్ని మార్గములలో కూడా అనుసరించాలనీ కూడా సిఫార్సు చేశారు. రూట్లలో మార్పు, కొత్త రూట్లను ప్రారంభించుట గురించి కొంతిమంది సభ్యులు చేసిన సూచనలను పరిశీలించవలెనని ప్రభుత్వాన్ని కోరారు.

## కాంగ్రెసులో పునఃప్రవేశం

సోంపేట, సెప్టెంబరు 10: ఈ తాలూకా కాంగ్రెసు సంఘమును పునర్నిర్మాణ మొనర్చి పటిష్టం చేయుటకు, డి. దాసన్న, కే. శ్రీరాముల గార్లు కృషిఫలితముగా, నన్ని పద్మనాభరావు దొరగారు, తమఅనుయాయులతో సహా తిరిగి కాంగ్రెసులో ప్రవేశించారు. (స్వ. వి.)

## సోంపేటలో కలరా

సోంపేట, సెప్టెంబరు 10: ఇటీవల ఈ ఊర్లో 15 మందికి కలరాసోకి దానిలో 8 మంది చనిపోయారు. ఆరోగ్యాధికార్లు పంచాయితీ బోర్డువారు వ్యాధి నివారణకు తగు శ్రద్ధవహించి పనిచేస్తున్నారు. (స్వ. వి.)

## వయోజన విద్యాబోధకులకు శిక్షణ

కోయిలకుంట్ల, సెప్టెంబరు 10: ఆ ఫకా రేతిన గ్రామీణవయోజన విద్యాబోధకుల శిక్షణ శిబిరము, నాయిన పేరి కనెపల్లి పంచలారి గ్రామంలో ఈ 20 నుండి 26 వరకూ జరుగనని, నాయిడన్న హనుమంతరెడ్డిగారు గ్రామ ప్రచారవాలుగా వ్యవహరించనుని. ఉపాధ్యాయులు సోసైటీమెంబరులు యీ అవకాశం వినియోగించు చేసు కోవలెనని గ్రామ కే. లక్ష్మీనారాయణమ్మగారు కోరుతున్నారు.

## జెనీవాలో అంతగా సాధించిందేమీ లేదు

### శ్రీ గోపాలస్వామిఅయ్యంగార్ పునరుద్ఘాటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 13: "జనీవా సంప్రతింపులవల్ల అంతగా సాధించబడలేదు; ప్రాతిపదికసమస్యలు ప్రతి తె వున్నాయో అవి అల్లాగే మిగిలి వున్నాయి." అని ఈ అసలు ఇవాల జనీవానుంచి ఇప్పటికి తిరిగివచ్చిన రక్షణశాఖామంత్రి శ్రీ గోపాలస్వామి అయ్యంగారు వ్యాఖ్యానం చేశారు. ఆ తేలకుండావున్న ప్రాతిపదిక సమస్య లేవనగా ఒకటి, యుద్ధవిరమణ పరిహార్దుకు ఇవల అవల యెంత సైన్యాన్ని అట్టేపుంచాలి; రెండు, జనవాక్యనిర్ధారకుడు అధికారస్వీకారం ఎప్పుడు చెయ్యాలి. ఈ రెండు అంశాలమీద సమాధానం సాధించడానికి అనేక ప్రయత్నాలైతే జరిగాయి గాని ఉభయులకు అంగీకారం యోగ్యమైన పరిష్కారమార్గం అంటూ ఏదీ కల్పించలేదు.

ఇంతవరకు జరిగిన సంప్రతింపుల ధోరణినిబట్టి ఐక్యరాజ్యసమితి మధ్యవర్తి గ్రాహాం చేయగల నిర్ణయాల మీద, భద్రతా మండలికి ఆయన సమర్పించబోయే నివేదికమీద, ఈ తీరకొంత ఆధారపడి వుంటుంది. పాకిస్థాన్ విదేశాంగ మంత్రి జఫ్రుల్లాఖాన్‌తో తాను ముఖాముఖిగ జరిపిన సంప్రతింపులను గురించి ప్రస్తావిస్తు ఇవి డా॥ గ్రాహాంకు తెలిపి జరిపిన సంప్రతింపులే కాని లహాయకారీగా జరిగినవి కావు; ఈ సంప్రతింపులన్నీ ఐక్యరాజ్య సమితి తీర్మానాలను అనుసరించి సమితి మధ్యవర్తి అధ్వర్యాన జరిగినట్టుగానే పరిగణించవలసి వుంటుంది" అని స్పష్టం చేశారు. అదీకాక ఈ సమస్యా పరిష్కారానికి డా॥ గ్రహాం ప్రతిపాదనలు చేయటంలో ఆయన కేవలం సమితి తనకు ఇచ్చి వున్న అధికారాన్ని వినియోగించుకున్నాడే తప్ప, హద్దుమీరి ప్రవర్తించింది ఏమీ లేదు. విమానాశ్రయంలో శ్రీ అయ్యంగారికి భారత సర్వసేనాని కరియప్ప రక్షణశాఖ సహాయ మంత్రి సుర్జిత్ సింగు ప్రభృతులు స్వాగతమిచ్చారు.

## శాంతిరక్ష పశ్చిమ రాజ్యాల సైనిక బలమే

### అమెరికన్ రచయిత లూయిస్ ఫిషర్ అభిభాషణ

మదరాసు, సెప్టెంబరు 14: పశ్చిమ రాజ్యాల సైనికబలమే యుద్ధం రాకుండా పెద్ద రక్షగవుంటోందని ప్రఖ్యాత అమెరికన్ గ్రంథకర్త, రచయిత శ్రీ లూయిస్ ఫిషర్ ఇవ్వాళ దక్షిణ భారత పత్రికా రచయితల సంఘంలో ఉపన్యసిస్తూ అన్నారు.

లూయిస్ ఫిషర్ ఉపన్యాసంలో యింకా యిలా అన్నారు: యుద్ధభీతి లేక పోవడం శాంతి కంటే ఒక మెట్టు తక్కువ. సుస్థిరశాంతి స్థాపనకు వీలైన సర్వసంపన్నమైన ప్రపంచ స్థాపనకు కృషి చేయుట మానవజాతికి తక్షణ సమస్య అయింది. లక్ష్యము కంటె సాధనము ప్రధానము గనుక కోమిన్ ఫారము, సోవియట్ పద్ధతుల్లో జరుగుతున్న కృషి నాకు నచ్చదు. ప్రతి యొక్కరు ప్రపంచ పౌరునిగ భావించుకోవాలి. కాని మనం అస్థితికి చాల దూరంగవున్నాం. వివిధదేశాల మధ్య ద్వేషాలు ప్రబలంగ వున్నాయి. అయినా ఒక్క ఆశకలబడుతోంది. మూడవ ప్రపంచ యుద్ధం రాదని నాని శ్చితాభిప్రాయం. అంత మాత్రం చేత యుద్ధభయం లేదు గాని శాంతి నిర్వడదు. శాంతి అంటే యుద్ధం లేక పోవటమే కాదు. ఇంకా మనం ఆస్థాయికి రాలేదు. పాశ్చాత్యదేశాల సైనికబలమే యుద్ధంరాకుండా రక్షగవుంది. శాశ్వతశాంతికి నిలయమైన ప్రపంచమును నిర్మించుట ఎట్లా అనేది నేడు మానవ జాతికి సమస్య అయింది. అవసరము వత్తిడికల్గిన గాని మానవజాతి జీవించదు. యోగ్యమైన పరిస్థితులను కల్పించుకోవాలనే వుతూ కాలం సర్వత్రా వ్యాపించి వుందని అన్నారు.

ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ ఎస్. రఘునాథ అయ్యర్ ఫిషర్‌కు స్వాగతమిచ్చి సభ్యులకు పరిచయం చేశారు.

తర్వాత ఫిషర్ ప్రశ్నలకు సమాధానం యిస్తూ యిల్లా అన్నారు. అమెరికా విదేశనీతి జనకూల ఏనీ స్థాంతమూ లేదు. దురాక్రమణ దురాక్రమణకు దారి తీస్తుందని పశ్చిమ రాజ్యాలు గ్రహించి అమెరికా నాయకత్వము క్రింద దురాక్రమణ నిరోధమునకు పూనుకున్నాయి. దురాక్రమణకు లోనుకాగల దేశాలకు సహాయం చేయటం అమెరికా సిద్ధాంతంగా పెట్టుకుంది. స్టాలిన్‌వల్ల మరో ప్రపంచ యుద్ధభీతి తొలగింది. యూరోప్, ఆసియాలలోని ఏదేశము తనంతటతానుగ స్వా, సైన్యాలదాడిని అరికట్టలేవు. కాని పశ్చిమ రాజ్యాలసైనిక బలమువల్ల నేడు యుద్ధభీతి తొలగింది. ప్రపంచంలోని ప్రజాస్వామ్య శక్తులు "స్టాలినిజం"ను ఎదుర్కొనుటకు "కోమిన్ ఫారం" పద్ధతుల్లో సంఘటితం కాలేదని చెప్పారు.

## "చీటికి మాటికి సమ్మెలు చేస్తే ప్రభుత్వం ఏమాత్రం సహించదు"

### తగాదాలను మధ్యవర్తిద్వారా పరిష్కరించుకోవాలని కార్మికులకు మంత్రిగారి సలహా

మద్రాసు, సెప్టంబరు 15: ప్రభుత్వానికి అగిన విధాన పన్ను సంపదని పట్టుయితే బకింగ్‌హాం కర్ణాటక మిల్లు యజమానులకు, పనివారికి వచ్చిన తగాదాను మధ్యవర్తిత్వ తీర్పువల్ల ఉభయులకు న్యాయంగాను, యుక్తంగాను పరిష్కరించవచ్చు నని మద్రాసు ప్రభుత్వ కార్మికశాఖా మంత్రి డా॥ ఉమాకృష్ణారావు గారు నిన్న సాయంత్రం పెరంబూరులో సగరంలో మద్రాసు బట్టలమిల్లుల పనివారలసంఘ ఆధ్వర్యాన జరిగినసభలో మాట్లాడుతూ చెప్పారు. జి. సెల్వపతి చెట్టిగారు మంత్రి గారికి స్వాగతం చెప్పి కార్మికుల కష్టాలను ఏకరువు చేశారు.

మంత్రిగారు తమ ప్రసంగంలో ఇల్లా చెప్పారు:

"నామనిర్ద్యంతో ఈ సమస్యను పరిష్కారం చేసే మార్గాలన్నీ విఫలమైనప్పుడు తప్ప మీరు సమ్మె చెయ్యరాదు. మీరు తొందరపడి ఆ పని చేస్తే శాంతి భద్రతల రక్షణను దృష్టోలిస్తిని నిలబెట్టడానికి ప్రభుత్వం అడ్డుపడకతప్పదు. ఇందుకు సంబంధించిన వారందరితోను నేను మాట్లాడాను. ఇంకా పూర్తి వ్యవహారాలు తెలియలేదు. ఇతర మిల్లులవలెగాక యిక్కడి ప్రతి ఆరు నెలలకు ఒక బోనసు యివ్వడం సంప్రదాయంగా ఉన్నదన్నారు. నష్టాలు వచ్చినందున జూన్‌తో అంతమైన అర్ధ సంవత్సరానికి బోనసు ఇవ్వలేమని మిల్లు పరిపాలక వర్గంవారు ప్రకటించారు. వారు అందుకు తెలిపిన కారణాలు కొందరికి రుచించవచ్చు. కొందరికి రుచించక పోవచ్చు. ఉభయులు అంగీకరించే మధ్యవర్తిత్వ ఏర్పాటుచేత ఈ సమస్యను నిష్పాక్షికంగా పరిశీలింప చెయ్యాలి.

కేంద్రంలోను, రాష్ట్రంలోను కాంగ్రెసు ప్రభుత్వాలు కార్మికుల క్షేమమును కాంక్షిస్తున్నవి. ఈ దృష్ట్యా గత ఐదేండ్లలో కార్మికులకు లాభం చేస్తాయనే శాసనాలను చేసినవి. ఇందువల్ల ఎంత ప్రయోజనం కల్గిందని విమర్శించుకొని ఉభయత్రా సంభాషణలు జరుపుకొని ప్రధాన సమస్యలు పరిష్కరించుకోవడం మంచిది అని ప్రభుత్వంవారు సలహా ఇస్తున్నారు. ప్రతి కార్యాలయంలోను ఏర్పాటు చేయబడిన వర్క్స్ కమిటీ ఇందు నిమిత్తం సంకల్పించబడినదే. ఈ కమిటీలలో కార్మికుల నిజమైన ప్రతినిధులనే ఎన్నుకోవాలి. వారు ఈ సంఘాల్లో వివిధ విషయాలను ప్రస్తావించి సమరసంగా పరిష్కరించుకోవచ్చు. అట్టి పరిస్థితులలో ఇన్ని కార్మికసంఘాలు ఉండవలసినపని ఉండదు. ఉభయులూ సామరస్యానికి చేసుకున్న యత్నాలు విఫలమైనప్పుడు కార్మికసంఘాల ప్రమేయం వస్తుంది. అప్పుడు త్రైపాక్షిక సంభాషణలు లేదా, మధ్యవర్తిత్వంవల్ల తగాదాను పరిష్కరించుకోవచ్చు. ఈ మార్గాలన్నీ నిష్ఫలమైనప్పుడు కార్మికులు సమ్మెసంగతి ఎత్తవచ్చు."

"బకింగ్‌హాం అండ్ కర్నాటిక్ మిల్లు పనివారు ఈ విధమైన సామరస్య మార్గాన బోనసు సమస్యను పరిష్కరించుకోవాలి. ఏ కారణం వల్లనైనా పరిపాలకవర్గంతో వారి సమస్యను పరిష్కరించుకో లేకపోతే ప్రభుత్వానికి యుక్తమైన విధాన విజ్ఞప్తి చేసుకొంటే వారు తగువిధాన తగాదాను పరిష్కరించగలరు. బకింగ్‌హాం కర్నాటిక్ మిల్లులో రెండు కార్మిక సంఘాలు, ఉన్నప్పుడు వర్క్స్ కమిటీ నిర్మాణం ఏ విధంగా చెయ్యడం అని మిల్లుయజమానులు మాకు వ్రాశారు. ఏ యూనియన్ను మిల్లు పాలకవర్గం గుర్తించాలని చెప్పవలసింది ప్రభుత్వం గాదనీ, ఆ విషయం మిల్లువారిదేననీ మేము తెలియచేశాము. మెజారిటీ కార్మికులు ఉన్న సంఘాన్ని మిల్లువారు గుర్తించినప్పుడు మైనారిటీ సంఘానికి నిజమైనకష్టాలు ఉన్నప్పుడు ఈ విషయంలో ప్రభుత్వం కొంత చర్య తీసుకోగలరు. ఈ వివాదంవల్ల పరిపాలకవర్గంవారు వర్క్స్ కమిటీల బదులు సలహాసంఘాలను స్థాపించారు.

ఈ సలహాసంఘాలు ఈ బోనసు విషయంలో ప్రయోజనకరమైన పని చేయలేక పోయినవన్నప్పుడు ఈ సమస్యను మీరు ప్రభుత్వానికి తెలిపినప్పుడు వారు చేయరు. కనుకనరుకు ఈ వ్యవహారాన్ని తెలియచేయగలరు. గత అర్ధసాలున నష్టం వినిపంగా వచ్చిందో బుజువు చూపించవలసిందిగా అడిగగలరు. ఆ సమయంలో కార్మికులూ తమ ప్రతినిధులను పంపవచ్చు. అది విఫలమైనప్పుడు మధ్యవర్తి పరిష్కారం ఏర్పాటు చేసుకోవచ్చు. ఇందువల్ల ఆరునెలలు వ్యవధి పట్టవచ్చు. ఆ కారణంచేత కార్మికులు ఓర్పును కోల్పోవరాదు. కార్మికులు శాంతంగానుండాలి. ఉభయత్రా సామరస్యం ఉండే విధాన సమస్యల పరిష్కరించు కోవాలిగాని అందరికీ కష్టనష్టాలకు కారణమైన సమ్మెకు త్వరపడి దిగరాదు.

## హైద్రాబాద్ చేనేత పనివారి ఇక్కట్లు

### కేంద్రప్రభుత్వానికి విజ్ఞప్తి

హైదరాబాదు, సెప్టెంబరు 15:— ఆకలిమంటలలో అలమటిస్తున్న లక్షలాదిమంది చేనేతివారుల కనాకష్టస్థితిని గమనించి, తక్షణం వారికిషేత్రవా ఒకగతి చూపెట్టవలసిందిగా హైదరాబాదు సంస్థాన చేనేత కాంగ్రెసు అధ్యక్షుడు యల్. కొండా గారు భారత ప్రభుత్వానికి నేడొక విజ్ఞప్తి చేశారు. అందరికీ ఉద్యోగం లభించే విధంగా చేనేత పరిశ్రమకు సంపూర్ణ రక్షణ ఇవ్వవలసిందని ఆయనకోరాడు.

గాంధీజీ అనుయాయులనిపించుకొని, ప్రస్తుతం అధికారంలో ఉన్నవారు ఆ మహాత్మునికి ఎంతో ప్రీతిపాత్రమైన చేనేత పరిశ్రమనే సరిగా ప్రోత్సహించకున్నందుకు కొండాగారు విచారం వెలిబుచ్చారు.

## శ్రీకాకుళంజిల్లా చేనేత సహకారసంఘ ప్రతినిధులసభ

శ్రీకాకుళం, సెప్టెంబరు 10:— ఈ జిల్లా చేనేత సహకారసంఘ ప్రతినిధుల త్రైమాసికసభ, యీ 6 వ తేదీన కోతిన బసవరాజు గారి అధ్యక్షతన సహకార సంఘాల డిప్యూటీ రిజస్ట్రార్ ఆఫీసులో జరిగినది. శ్రీకాకుళం కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు స్పెషల్ ఆఫీసరు, రీజినల్ మార్కెటింగు ఆఫీసరు సభకు హాజరైనారు. చేనేత పరిశ్రమకు, చీరలు ధోవతులు మొదలగునాటి ఉత్పత్తిని ప్రత్యేకించు విషయమై, కేంద్ర పరిశ్రమల మంత్రి కృష్ణమాచారి గారి విరుద్ధముగా ప్రసంగించినందులకు నిరసన వల్లడిస్తూ తీర్మానించారు.

ప్రభుత్వము తలపెట్టిన చేనేతరిలీఫ్ స్కీమును, యీ జిల్లాలో వెంటనే ప్రవేశపెట్టుటకు తీర్మానించారు. బారువ, మందసా, తిలారు, వరపన్నపేట, వింపోలు, పాలకొండ, సంఘాలలో వెంటనే రిలీఫ్ స్కీము ప్రవేశ పెట్టుటకు తగుచర్య తీసుకోవలసిందిగా డిప్యూటీ రిజస్ట్రారును కోరుతూ తీర్మానించారు.

40 నుండి 48 అంగుళాల వస్త్రముల ఉత్పత్తిని చేనేత పరిశ్రమకు కేటాయించాలని కోరుతూ మరో తీర్మానం చేశారు. (బ. వి.)

## చేబ్రోలు

ఈ పట్టణ చేనేత కాంగ్రెసువారు యీ నెల 9 వ తేదీన సంఘ అధ్యక్షులగు గట్టుపాల కోటయ్యగారి అధ్యక్షతన సమావేశమై మద్రాసులో కేంద్ర ప్రభుత్వ పరిశ్రమల శాఖా మంత్రి టి. టి. కృష్ణమాచారిగారు చేనేత పరిశ్రమగురించి చేసిన ప్రసంగాన్ని నిరసించారు. 40 మొదలు 50 అంగుళముల వెడల్పుకల అన్ని వస్త్రముల ఉత్పత్తిని చేనేత పరిశ్రమలకు కేటాయించాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

## మోటారుబండ్ల పన్ను లైసెన్సు

మదరాసు, సెప్టెంబరు 13: ఈ సంవత్సరం డిశంబరు 31 వ తేదీతో అంతమయ్యే మూడు మాసాలకు 31-3-53 తో అంతమయ్యే అర్ధసంవత్సరానికి అన్ని రకాల మోటారుబండ్లకు పన్నుల లైసెన్సులు ఎగ్మూరులోని ట్రాఫిక్ లైసెన్సింగ్ పోలీసు కమిషనరు ఆఫీసులో మోటారుబండి స్వంతదారులసౌకర్యం నిమిత్తం 15-9-52 వ తేదీనుండి యివ్వబడుతుంది. మోటారు స్వంతదారులు తమపన్ను మొత్తాలను నగదుగగాని చెక్కురూపంలోగాని చెల్లించవచ్చు. మోటారుబండ్లవారు పన్నులు చెల్లించటానికి తుదివరకు ఆగకుండా మొదటే లైసెన్సులను పొందేట్టయితే ఆఖరు రోజులలో వరుస క్రమానుసారం నిలిచి లైసెన్సు తీసుకోవలసిన శ్రమను తప్పించుకో వచ్చును.

## 21 వ ఎల్. ఐ. ఎం. మహాసభ

21 వ యల్. ఐ. యం. మహాసభ యీ నెల 22 వ తేదీని కుంభకోణం టవును హైస్కూలులో జరుగుతుంది. మదరాసు ప్రభుత్వ దేశీయ వైద్యశాఖ గౌరవ డైరెక్టరు డా॥ యం. ఆర్. గురుస్వామి మొదలియారుగారు మహాసభను ప్రదర్శనమును ప్రారంభిస్తారు. మాయవారం డాక్టరు యస్. యన్. శ్రీనివాసన్ గారు అధ్యక్షతవహిస్తారు.

## ఓటర్ల జాబితాలో రావి నారాయణరెడ్డిగారి పేరు

హైద్రాబాద్, సెప్టెంబరు 14: రావి నారాయణరెడ్డి గారి పేరు ఓటర్ల జాబితాలో లేక పోలేదనీ, భువనగిరి నియోజకవర్గం ఓటరు జాబితాలలో 3 వ అనుబంధములో ఆయన పేరు ఉన్నదనీ హైద్రాబాద్ ప్రభుత్వం వారు నేడొక పత్రికా ప్రకటనలో తెలియజేశారు.



## ప్రకటన

### మద్రాసు ప్రభుత్వము ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు

ఇందుమూలముగ తెలియపరచున దేమనగా 1. సీలు వేసినకవర్లలో "సింహాచలం సబ్ స్టేషన్ - స్పెసిఫికేషన్ టి. యల్. సి. ఐ. వద్ద నివాస గృహములు, ఇతర కట్టడములకు ఎలెక్ట్రిఫికేషన్ చేయుటకై" అని వ్రాసి, టెండరర్ల పేరుకూడా సమూదుపర్చిన, టెండర్లు సూపరింటెండింగ్ ఇంజనీరు టి. యల్. సి. (ఉత్తరం) డాబా గార్డెన్సు, వాల్తేర్, ఆర్. యస్. లోని వారి ఆఫీసు వద్ద 17-10-1952 తేదీ మధ్యాహ్నం 3 గంటల వరకు దిగువ వివరించిన పనికిగాను దాఖలు చేసికొందురు.

["సింహాచలం సబ్ - స్టేషన్ వద్దనివాస గృహములు మరియు యితర కట్టడములకు ఎలెక్ట్రిఫికేషను చేయుట"]

2. ప్లానులు షెడ్యూళ్లు వగైరాలతో స్పెసిఫికేషన్ టి. యల్. సి. ఐ. కాపీలు, సూపరింటెండింగు ఇంజనీరు ట్రాన్స్‌మిషన్ లైన్ కన్‌స్ట్రక్షన్ (ఉత్తరం), వాల్తేర్, ఆర్. యస్. వారివద్ద, ఫారము ఖరీదుక్రింద సేలు టాక్సుతో (యీ సొమ్ము వాపసు చేయబడదు) సహా రు. 10-2-6 యే ప్రభుత్వపు ఖజానాలో గాని, ఇండియా రిజర్వు బ్యాంకు యే బ్రాంచిలో గాని "P. W. III other remittances receipts on account of Superintending Engineer, Transmission Line Construction (North), Daba Gardens, Waltair R. S.- Miscelleneous - State Madras - Sales of specification" అను శీర్షిక క్రింద చెల్లించిన చలానా జతపరుస్తూ, దరఖాస్తు చేసి పొందవచ్చును.

3. డిపార్టుమెంటువారు నిర్ణయించిన ఫారములలోను, నియమించిన కాల పరిమితిలోను, పంపుకోనని టెండర్లు నిరాకరింపబడును.

4. ఏ టెండరునుగాని, లేక అన్ని టెండర్లనుగాని, యే కారణములుచూపకనే నిరాకరించు హక్కు సూపరింటెండింగు ఇంజనీరుగారికి గలదు. మరియు టెండరులో కనుపరచబడనిని యిరువురు లేక అనేకమంది టెండరర్ల మధ్య పంపిణీ చేయగల అధికారము సూపరింటెండింగు ఇంజనీరుకు గలదు.

టి. కృష్ణస్వామి,
సూపరింటెండింగు ఇంజనీరు,
ట్రాన్స్‌మిషన్ లైన్ కన్‌స్ట్రక్షన్,
(ఉత్తరం) స్టేషన్ వాల్తేర్, R.S.
తే. 6—9—1952.

## సెంట్రల్ రైల్వే

### రైల్వే డాకుమెంటు పోయినవి.

దిగువ వివరించిన డాకుమెంట్లు అంగుల కేదురగా నమూదుపర్చిన స్టేషనులలో కనుపడుట లేదు. పోయిన ఈ డాకుమెంట్లును మోస విధముగా ఉపయోగింపబడకుండునట్లు చూడవలసినదని ప్రజలకు కోర డమయినది.

1. మద్రాస్ మహల్ నెం. 7321 గల "టు పే" లోకల్ గూడ్స్ ఫోలియో నెం. 99 గల ఇన్‌వాయిస్ రసీదు ఫోయిల్సు. (2) కోటల్ బుక్కు నెం. 8417 "టు పే" ఫారిన్ గూడ్స్ 1 నుండి 10 వరకు ఉపయోగింపబడినట్టియు, 11 నుండి 100 వరకు ఖాళీగా వుండునట్టియు, రికార్డు, దకిగ, జంక్షన్ మరియు త్రూ బుక్కింగ్ ఇన్‌వాయిస్ ఫోలియోలు.

## దక్షిణ రైల్వే

### సవరణ

రాళ్లు, మొరం కంకర, రాతి సుంక, గుంతకల్లు జిల్లా, గుంతకల్లు సబ్ డివిజనుకు సప్లయి చేయు విషయమై. గుంతకల్లు సబ్ డివిజన్ యొక్క జూరిస్ డిక్షన్ హిందుపూరునుండి గుంతకల్లు, మరియు గుంటూరు-మాచర్ల బ్రాంచితో సహా గుంతకల్లు నుండి - తాడేపల్లివరకు అని పైదానిగా నున్న పిలువబడిన టెండరులో మొదటి ప్యారాగ్రాఫ్‌లో పొరబాటున తెలుపబడినది. దానిని "హిందుపూరు నుండి-గుంతకల్లు మరియు గుంతకల్లు నుండి దిగువమెట్టవరకు" అని చదువు కొనకోరడమైనది. ఈ పనికి టెండర్లు తీసుకొనుటకు ఆఖరు తేది 23—9—52 మంగళవారము మ॥ 3 గంటలు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras.

# రాష్ట్రంలో పురపాలక సంఘాల ఎన్నికల కోలాహలం



భీమవరం పురపాలక సంఘానికి పోటీలేకుండా ఎన్నికైన పెండ్యాల అనసూయా దేవి గారు.

## భీమవరంలో ఇద్దరి ఎన్నిక

భీమవరం, సెప్టెంబరు 12: ఈపుర పాలక సంఘం 24 స్థానాలకు దాఖలు అయిన 94 నామినేషన్లలో 23 నిన్న ఉపసంహరింపబడినాయి. 1-వ వార్డు స్త్రీ స్థానానికి పెండ్యాల అనసూయా దేవి, 3-వ వార్డు జనరల్ స్థానానికి గాదిరాజు జగన్నాథరాజు గార్లు మాత్రమే నామినేషన్లు వేసినందున పోటీ లేకుండా ఎన్నికైనారు. పోతే, 22 స్థానాలకు 69 మంది పోటీ చేస్తున్నారు. కాంగ్రెసు, ప్రజాపార్టీలు అభ్యర్థులను నిలపలేదు. కమ్యూనిస్టు పార్టీ 9 మందిని బలపరుస్తున్నది.

## బళ్ళారిలో 7 గురి ఎన్నిక

బళ్ళారి, సెప్టెంబరు 12: ఈ పుర పాలక సంఘం ఎన్నికలలో ఏడుగురు పోటీలేకుండా ఎన్నికైనారు. వారి పేర్లు: టి. గంగమ్మ, ఎస్. మృత్యుంజయశాస్త్రి, దుర్గప్ప, పకీరప్ప, ముల్లంగి గౌడ్డ బసప్ప, సయ్యద్ అబుర్ కరీం, సుశేషాల్ ఖాన్, ఇక్కడ అసలు 97 మంది 324 నామినేషన్లు వేశారు. వీరిలో ఉపసంహారానికి తుదిరోజైన నిన్న 85 మంది విరమించుకొన్నారు. పోతే ఇక 65 మంది పోటీకి మిగిలారు.

## ఆదోనిలో 7 గురి ఎన్నిక

ఆదోని, సెప్టెంబరు 12: ఈ పుర పాలక సంఘం 32 స్థానాలకు 131 నామినేషనులు దాఖలైనవి. తర్వాత 20 మంది ఉపసంహరించుకొన్నారు. 4, 6, 8, 9, 14, 18 (రి) 21 వార్డు లకు వరుసగా ఎస్. తిమ్మన్న, ఎ. నరసప్ప, సి. డి. సేనప్ప, బి దరప్ప, ఎల్. నాగోజీరావు, అంకమ్మ, శంషుద్దీన్ గార్లు పోటీలేకుండా ఎన్నికైనారు. పోతే మిగతా 25 స్థానాలకు 104 మంది పోటీ చేస్తున్నారు. పోలింగు అక్టోబరున జరుగుతుంది. (స్వ. వి.)

## ప్రొద్దుటూరులో ఒకరి ఎన్నిక

ప్రొద్దుటూరు, సెప్టెంబరు 12: ఈ పురపాలక సంఘానికి 8 వ వార్డునుంచి ఆసం సంజీవరెడ్డిగారు పోటీలేకుండా ఎన్నికైనారు. అసలు 20 వార్డులలో గల 24 స్థానాలకు 84 మంది 114 నామినేషన్లు వేశారు. వీరిలో 9 మంది ఉపసంహరించుకొన్నారు. 2వ వార్డు హరిజన స్థానానికి కమ్యూనిస్టు పార్టీ తరఫున, తన తండ్రికే పోటీగా, బండిల ఓబులపతి దాఖల్ చేసిన నామినేషన్ను, దానిపై ఆయనదస్కతు చేయనందున తోసివేశారు. ఆయన జిల్లాకలెక్టరుకు అప్పీలు చేసినట్లు తెలుస్తున్నది. 15వ వార్డులో హరిజన్ అభ్యర్థి వాన నరసయ్య వేసిన నామినేషన్, ఆయన మునిసిపల్ ఉద్యోగి అయినందున తోసివేశారు. కాగా ఇక 23 స్థానాలకు 68 మందికి పోటీ జరుగుతున్నది. (స్వ. వి.)

## విశాఖపట్నంలో 4 గురి ఎన్నిక

విశాఖపట్నం, సెప్టెంబరు 13: ఈ పురపాలకసంఘానికి తెన్నేటి రమణమ్మ, యెల్లుస్వామి, పైడితల్లి పాపారావు పోటీలేకుండా ఎన్నికైనట్లు ఎన్నికోద్యోగి ప్రకటించారు. 16 గురు అభ్యర్థులు ఉపసంహరించుకోగా 31 స్థానాలకు 71 మంది పోటీ చేస్తున్నారు. ఇన్నాళ్లలా ఆంగ్లో ఇండియన్ రిజర్వుస్థానంగా వుండి ఇప్పుడు సాధారణ స్థానంగా మార్చబడిననియోజక స్థానానికి నామినేషన్లు అక్టోబరు 11 న దాఖలు చేయాలని ప్రకటించారు. [స్వ. వి.]

## ఆంధ్ర సారస్వత పరిషత్తు రెండవ పరీక్ష

హైదరాబాదు, సెప్టెంబరు 10: పరిషత్తు ప్రధాన కార్యదర్శి ఇట్లు తెలియజేయుచున్నారు:- "ఈ సంవత్సరమున జరుగు రెండవ పరీక్ష డిసెంబరు 19, 20, 21, 22 తేదీలలో జరుగును. పరీక్షల శుల్కములు, అభ్యర్థి పత్రములు అక్టోబరు 20 వ తేదిలోపల పరిషత్తు ప్రధాన కార్యాలయమునకు చేరవలయును. తెలంగాణమున ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలను స్థిరమైన పరీక్షా కేంద్రములుగా నిర్ణయించ వలెనన్న విషయము ఆలోచనలో ఉన్నది. సకాలమున సరియైన విధమున అభ్యర్థి పత్రములు పూరించి పంపుటలో శాఖా, కేంద్ర కార్యకర్తలు శ్రద్ధవహించ వేడికోలు."

## తెలంగాణా రచయితల సంఘం

హైదరాబాదు, సెప్టెంబరు 13: మొన్న 10 తేదీ సాయంత్రం రెడ్డి హాస్టలులో తెలంగాణా రచయితల సంఘము ఎన్నికలు జరిగెను. సంఘ నియమావళి ననుసరించి, సాధారణ సభ్యులు అధ్యక్షుణ్ని మాత్రమే ఎన్నుకోవలయును. ఇంతవరకు తాత్కాలికాధ్యక్షులుగా ఉన్న 'దాశరథి' గారే తిరిగి అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడిరి. కార్యక్రమ నిర్వహణకై అధ్యక్షులచే ఈ క్రింది కార్యవర్గం నియమించబడింది:-

ఉపాధ్యక్షుడు భాగి నారాయణమూర్తిగారు, ప్రధాన కార్యదర్శి పి. నారాయణ రెడ్డిగారు, సంయుక్త కార్యదర్శి ఆకెళ్ళ సుబ్రహ్మణ్య కవిగారు కార్యవర్గ సభ్యులు:- (1) కాళోజీ నారాయణ రావుగారు, (2) దేవులపల్లి రామానుజ రావుగారు, (3) బి. రామరాజుగారు, (4) శ్రీమతి యశోదా దేవిగారు, (5) పి. మాణిక్య రెడ్డిగారు.

## చెన్నపురి ఆంధ్ర మహాసభ

పై సభ యాజమాన్యమున రేపు 16వ తేదీ సాయ 6 గం. సభా భవనంలో ప్రొ జే. సత్యనారాయణమూర్తిగారు గీతాసారం గూర్చి ఉపన్యసిస్తారు.

## క్రీడారంగం:

# ప్రపంచ హాకీ పోటీలు: ఇండియాలో జరపడానికి నిర్ణయం

కలకత్తా, సెప్టెం 14: 1956 లో మెల్బోర్న్‌లో ప్రపంచ ఒలింపిక్ పోటీలు జరగడానికి ముందు ఇండియాలో ప్రపంచ హాకీ పోటీలు జరపడానికి ఇండియా హాకీ ఫెడరేషన్ నిశ్చయించింది. ఈ విషయాన్ని ఇం. హా. ఫె. కోశాధికారి, బెంగాల్ హాకీఅసోసియేషన్ సహాయ కార్యదర్శి అయిన బువల్, మిత్రా వెల్లడించారు. ఈ పోటీలు నిర్వహించేందుకు బెం.హా.అ. కి విరివిగా విరాళా లివ్వాలని క్రీడాభిమానులకు ఆయన విజ్ఞప్తి చేశారు. ఈ పోటీలవల్ల ప్రపంచంలోని ఏ దేశంవారు ఏ విధంగా ఆడతారో చూస్తే అవకాశం మన దేశీయులకు లభిస్తుందన్నారు.

ఇం. హా. ఫెడరేషన్ రజతోత్సవం వచ్చేయేడు జరపవలసి వున్నదనీ, దానిని అర్హమైన రీతిని విజయవంతంగా జరపటానికి రూ. 150/- వేలు అవసరమనీ, ఈ ఆటలో తన దేశీయులు జగజ్జెట్టీలనే గర్వంతో ప్రతి భారతీయుడు ధారాళంగా ఇందుకు విరాళ మివ్వాలనీకూడా మిత్రా అన్నారు.

హెల్సింకీ పోటీలలో ఇండియా హాకీ టీములో పాల్గొన్న ఆర్. డాలజ్ వచ్చే నాలుగేండ్లలో జర్మనీని ఓడించడం చాలా కష్టమవుతుందన్నారు. ఇంగ్లాండు, హాలెండులలోకూడా ఆట చాలా అభివృద్ధి చెందిందన్నారు. భారతీయులు హాకీ యెడల ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపి, దాని వ్యాప్తికి కృషి చేయాలనీ, ఆటలో నేర్పు గణించాలనీ, ఇంకా బాగా ఆడేందుకు సిద్ధపడక పోతే రెండు సంవత్సరాలలో మనం వెనక పడిపోతామనీకూడా ఆయనఅన్నారు.

### ఎవ్వర్ మెర్రీ హాకీ పోటీ

మద్రాసు, సెప్టెంబరు 15: ఎవ్వర్ మెర్రీ హాకీ పోటీ ఫైనల్, రెండు నెలల వ్యవధి తర్వాత, నిన్న మళ్ళీ జరిగింది. సిటీపోలీసు రిక్రియేషన్ క్లబ్బు 2-0 గోలులతో మద్రాసు యునైటెడ్ క్లబ్బును ఓడించారు.

### బొంబై జోనల్ ఫుట్‌బాల్

బొంబై, సెప్టెంబరు 14: బొంబై జోనల్ ఫుట్ బాల్ పోటీలలో నేడు గోవా 11 గురికీ, మహారాష్ట్ర 11 గురికి సెమిఫైనల్ పోటీ జరిగింది. మొదటిటీము 3 గోలులలో గెలిచింది.

### కొలంబోక్లబ్‌లో వర్ణవిభేదం

కొలంబో, సెప్టెంబరు 14: సింహళ క్రీడాకారులలో మొనగాడైన లెఫ్టినెంటు డి. ఇంగిల్ టన్ మంగళవారం యిక్కడ ఆస్ట్రేలియా ఒలింపిక్ టీముతో జరుగనున్న నీటిపోలో మాచిలో పాల్గొన నిరాకరించాడు. ఈమాచ్‌ని కొలంబో స్విమ్మింగ్ క్లబ్ వారు ఏర్పాటు చేశారు. యూరోపియన్ల నిర్వహణలో వున్న ఈ క్లబ్బు వర్ణవిభేదము చూపుతున్నదనీ, అందుకనే తాను పాల్గొనననీ ఇంగిల్ టన్ అన్నాడు. ఇది వరలో ఈ క్లబ్బు సింహళీయులయెడ విముఖత చూపిందట. కొన్ని నెలల్కితం ఒకసారి ఈ క్లబ్బువారు ఇంగిల్ టన్‌ను, మరొక సింహళీయునీ, యూరోపియన్లతో కూర్చోనీయక, వీరికి స్నానాలగదిలో డ్రింకులు ఇచ్చారట. ఇప్పుడు క్లబ్బువారు వీరిద్దరినీ ఈ మాచ్‌లో పాల్గొనవలసిందని ఆహ్వానించారు. ఈ వర్ణవిభేద దృక్పథాన్ని మార్చుకొంటేగాని తాను పాల్గొన జాలనని ఇంగిల్‌టన్ పి. టి. ఐ. తో చెప్పాడు. క్లబ్బు కార్యదర్శిని ఈ విషయమై అడిగగా, తానేమీ వ్యాఖ్యానించ జాలననీ, ఒక్క ఆటగాని నిర్ణయంవల్ల ఆటకేమీ భంగం కలగదనీ అన్నాడు.

### బ్రహ్మానందం స్మారక టేబుల్ టెన్నిస్ పోటీలు

#### సింగిల్స్‌లో శివరామన్ గెలుపు

మద్రాసు, సెప్టెంబరు 15: చెన్నపురి ఆంధ్రమహాసభ వారు జరుపుతున్న బ్రహ్మానందంస్మారక టేబుల్ టెన్నిస్ పోటీలలో పురుషుల సింగిల్స్ బహుమతిని వి. శివరామన్ గెలుచుకొన్నాడు. ఈయన 21-9, 21-16, 21-17 తో ఎస్. రామన్‌ను ఓడించాడు. పురుషుల డబుల్స్ ఫైనల్ లో టి. తిరువేంకటం, టి. జె. తిరుమలైస్వామి 21-18, 21-19, 20-22, 16-21, 22-20 తో సి. కె. పార్థసారథి, వి. ఎస్. వరదరాజన్ లను ఓడించారు. బాయ్స్ సింగిల్సులో టి. రంగనాథన్, వెటరన్సులో కె. వి. సుబ్రహ్మణ్యం, సూర్యనారాయణరావులు గెలిచారు.

టి. డి. రంగనాథం నాయుడుగారు బహుమతులు పంచిపెట్టారు. పోటీల నిర్వాహక సంఘ కార్యదర్శి బి. సుబ్బారావుగారు నివేదిక చదివారు. చె. ఆం. మ. సభ ఉపాధ్యక్షుడు వి. వెంకటశేషయ్యగారి వందనాలతో కార్యక్రమం ముగిసింది.

# యలమంచిలికి విద్యుచ్ఛక్తి సప్లయి ఏర్పాట్లుమధ్యలో ఆపివేసినవైనం

తిరుపతి, సెప్టెంబరు 13: యలమంచిలి పంచాయతీకి, చుట్టుపట్ల గ్రామాలకూ విద్యుచ్ఛక్తి సప్లయి చేయటానికి జరుగుతున్న ఏర్పాట్లను మధ్యలో ఆపివేశారు. ఇందువల్ల ప్రజలలో చాలా అసంతృప్తి కలిగింది. ప్రభుత్వం ఇది గ్రహించి పని కొనసాగింప చేయాలి అని రాజా సాగి సూర్యనారాయణరాజు (ఎం. ఎల్. ఏ.) గారు వ్రాశారు.

ఈ సందర్భంలో ఇంతవరకూ జరిగిన పనిని వారీవిధంగా తెలుపుతున్నారు: ఈ స్కీమును పూర్వ ప్రభుత్వం మంజూరు చేసింది. విద్యుచ్ఛక్తిశాఖవారు ఈ సంవత్సరం మే 15-న యలమంచిలిలో ఆఫీసు పెట్టి, జకచకా సర్వే పూర్తిచేశారు. లైన్లు వేయడానికి సిద్ధంగావుండగా, పనిని నెమ్మదిగా సాగించవలసిందని శాసనసభ బడ్జెట్ సమావేశానికిముందు ప్రభుత్వం ఉత్తరువు చేసింది. బడ్జెట్‌లో మంజూరు అయినతర్వాత పని సాగుతుందని భావించాము. కాని ఇప్పుడు పనిని పూర్తిగా నిలిపివేయాలని ఉత్తరువు వచ్చిందనీ, ఉద్యోగుల బదిలీ ఉత్తరువులకు ఎదురు చూస్తున్నారనీ తెలిసింది. స్థంభాలు పాతేందుకు తెప్పించిన సిమెంటు మొదలైనవాటిని ఇతరచోట్లకు పంపుతున్నట్లూ ఇక్కడి ఆఫీసును ఎత్తివేయబోతున్నట్లూకూడా తెలిసింది.

## హిందీ బోర్డులపై తారుపూత

### గవర్నరు శ్రీ శ్రీప్రకాశ విమర్శ

తిరుచిరాపల్లి, సెప్టెంబరు 12: "తిరుచిస్టేషనులో బోర్డులపై ఉన్న హిందీ పేర్లను కప్పిపుచ్చుటకై దుండగులు ఉపయోగించిన తారును ఇంకే దైనా అక్కరకు వచ్చేపనికి ఉపయోగించి యుండవచ్చు. హిందీని యిప్పట్లో తక్షణమే జాతీయ భాషగా చేసే ఉద్దేశ్యం లేదు. కాని, రాష్ట్రాలకూ రాష్ట్రాలకూ మధ్య అభిప్రాయ ప్రకటనకూ వ్యాపారవ్యవహారాలకూ హిందీ చాలా ఉపయోగపడుతుంది. వివిధ రాష్ట్రాల మధ్య ఐక్యతకు కూడా యిది దోహదమివ్వగలదు." అంటూ మద్రాసు గవర్నరు శ్రీ శ్రీప్రకాశ గారు యిక్కడ చెప్పారు.

### శారదా విద్యాలయం

త్యాగరాయనగరు ఉస్మాన్ రోడ్డులో గల పై పాఠశాల యందు రేపు 16వ తేదీ సా 4గం. భారతీ దినోత్సవం జరుగుతుంది. శ్రీమతి కోటనాయకిగారు అధ్యక్షత వహిస్తారు. శ్రీమతి ఆనందనాయకిగారు ప్రసంగిస్తారు.

## రేడియో

బుధవారం, సెప్టెంబరు 17వతేదీ

**విజయవాడ**

ఉ॥ 7 తెలుగున వా॥, 7-15 మదరాసు (బి) వలె, 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1 మద్రాసు (బి) వలె, 1-30 మద్రాసు (ఎ) వలె, 1-40 హిందీలో వా॥, 1-50 తెలుగున వా॥, 2 మద్రాసు (బి) వలె, 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు, 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు.

సా॥ 5-30 శిష్టు శ్రీరామశాస్త్రి వీణ, 5-50 ఎస్. వి. ఆర్. విఠల్ రావు 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణం, 6-20 విజయవాడ రేడియోఆర్కెష్ట్రా 6-30 గ్రామస్థుల కార్యక్రమం, 7 తెలుగున వా॥, 7-15 గ్రామస్థుల కార్యక్రమం, 7-30 సంగీత శిక్షణ, 7-45 వార్తాసమీక్ష, 8 శిష్టు శ్రీరామమూర్తి వీణ, 8 30 యస్. వి. ఆర్. విఠల్ రావు, 9 ఆంగ్లమున వా॥, 9-15 శ్రోతలు కోరిన పాటలు (రి).

**మద్రాసు (ఎ)**

ఉ॥ 7 స్వాగతం, 7-15 తమిళమున వా॥, 7-30 ఎస్. ఎస్. వల్లి వీణ: 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు (తమిళం), 1 మహిళా మండలి (తమిళం), 1-30 గీతమంజరి (రి), 1-40 హిందీలో వా॥, 1-50 గానమంజరి (రి), 2 తమిళమున వా॥ 2-10 మద్రాసు (బి) వలె; 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు; 4-30 పాశ్చాత్య సంగీతము (రి).

సా॥ 5-30 ఎ. లక్ష్మీనరసు; సితార్; 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు, వాతావరణం, వాణిజ్య వా॥ (ఆంగ్లం); 6-20 శారదా రాజభూషణం; 7 తిరుక్కురళ్ నుండి పాటలు; 7-15 తమిళమున వా॥ 7-30 జంత్రసమ్మేళనం; 7-45 ముత్తుస్వామి కవిరాయర్ (ప్రసంగం); 8 ఎమ్. కల్పకం; 8-30 ద్వారం వెంకటస్వామినాయుడు; వయొలిన్ (రి); 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందుస్థానీ సంగీతం (ఆంగ్ల ప్రసంగం); 9-30 మద్రాసు (బి) వలె.

**మద్రాసు (బి)**

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 మధుర మణి అయ్యర్ (రి); 7-30 మద్రాసు (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం; 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు; 1 గీతిమాలిక (రి); 1-30 ఆంగ్లమున వా॥ 1-40 గీతమంజరి (రి); 1-50 తెలుగున వా॥ 2 గోటువాద్యము నిలయ విద్వాంసుడు; 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు; 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు; 4-30 మద్రాసు (ఎ) వలె.

సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె; 6-20 కె. ఆర్. కేశవమూర్తి: వయొలిన్; 6-30 గ్రామస్థుల కార్యక్రమం, 7 తెలుగున వా॥, 7-15 గ్రామస్థుల కార్యక్రమం, 7-30 మదరాసు (ఎ) వలె, 7-45 రంగస్థల పితామహులు, (ప్రసంగం), 8 కళ్ళజోడు (నాటిక), 8-30 మద్రాసు (ఎ) వలె, 9-30 ఆర్. యస్. లోకయ్య: క్లారినెట్, 10 శాస్త్రీయ సంగీతం (రి).

**హైదరాబాదు**

ఉ॥ 7 తెలుగున వా॥, 7-15 కళ్యాణి రంగాచారి, 7-45 ఖయాల్ భైరవ్: మున్షీ రజీయుద్దీన్, 8 ఆంగ్లమున వా॥, 8-15 దాద్రా, ఘజల్, అకీఫరవూఫ్, 8-30 సారంగి, అమీర్ బక్ష్, 8-45 ఖయాల్ తోడి: మున్షీ రజీయుద్దీన్: 9 ఉర్దూలో వార్తలు,

మ॥ 12-30 ఘజల్, కవాలీ (రి) 12-50 మహారాష్ట్రమున వా॥, 1-10 గానమంజూష (రి), 1-30 ఆంగ్లమున వా॥, 1-40 గీతసుధ (రి), 1-50 తెలుగున వా॥,

సా॥ 5-30 పిల్లల కార్యక్రమం, 6 ఆంగ్లమున వార్తలు, 6-10 స్థానిక ప్రకటనలు, 6-15 దాద్రా, ఘజల్: అకీఫ్ రవూఫ్, 6-30 నైర్వాణ్యం ఐతిహాసిక సాహిత్యం (సంస్కృత ప్రసంగం), 6-45 గ్రామసీమ, 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ స్త్రీల కార్యక్రమం, 7.45 కన్నడమున వా॥, 8 ఉర్దూలో వా॥ భవిష్యత్తును గురించిన ఊహలు (ఆంగ్ల ప్రసంగం), 8-30 కె. జంబగలక్ష్మి, 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥, 9-30 హిందీ కామెడీ (నాటిక), 10 ఖయాల్ బేహాగ్, మున్షీరియాజుద్దీన్.

